మి పాపని
జలుబుతో
బాధపడనిస్తారా?

అక్కరలేదు..!

# విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాపహాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయచ్చు.

ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:

1. 
బయట-చర్మం మీద

2. 
లోపల-ఊపిరి ద్వారా

**1.** బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది, హాయినిస్తుంది.

**2.** లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చిన ప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి. ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




SI6C A

## విక్స్ వేపొరబ్-జలుబుబాధలకి ఆధునిక ఔషధం

# సవ్యమైన పెంపకానికి రక్తి బోర్న్‌విటా శక్తి!

ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు—క్యాడ్‌బరిస్






Bensons/0391 TEL.

శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!

ఓహో ముడీస్ టి.జి. టీ
ప్రతి కప్పు చిక్కని రంగు కలిగి
చౌకగా ఉంటుందికూడా. ఎలా?

ఒకే ఒక చెంచాడు టి. జి.
టీ పొడుముతో చిక్కని చక్కని
టీ చేసుకొని సంతృప్తికరంగా
సేవించవచ్చు.





MUDIS TG TEA
MUDIS TG TEA
TOP GRADE DUST TEA

ఔను! ఇక ముడీస్ టీ మాత్రమే సేవించండి

# ముడీస్ టీ

1863 నుంచి ఇండియాలో ది బొంబాయి
బర్మా ట్రేడింగ్ కార్పొరేషన్ వారి తయారిక

కోడి మార్కు
టి.జి. టీ
ప్యాకెట్టు
నేడే కొనండి

ASP-M-36 TEL

మాకు
కావలసినవి
దౌరాలా
మిఠాయిలు!

మాకు
ఇవ్వండి
దౌరాలా
టాఫీస్!

మాకు
ఇవ్వండి
దౌరాలా
లాలిపాప్స్!

# పిల్లలకు ప్రీతి
# దౌరాలా మిఠాయిలు మరియు టాఫీలు

వివిధ రకముల రుచియైన సువాసనలలో లభించుచున్నవి

వ్యాపార వివరములకు:
కన్‌ఫెక్షనరీ సేల్స్ డిపార్ట్‌మెంట్
సంస్కృతి భవన్, ఝండేవాలాం,
న్యూ ఢిల్లీ-55




A DCM UNIT

# 'ఇప్పుడు నా చురుకుతనాన్ని చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!'



కాని, కొన్ని నెలల క్రితము నీరసంతో నేను ఆఫీసు పని సరిగ్గా చేయలేక పోయాను. చివరకి ఒక డాక్టర్ని సంప్రదించాను.

డాక్టరు ఇలా అన్నారు: "మీకు కావలసినంత పోషణ లభించలేదు. హార్లిక్స్ త్రాగండి!"

హార్లిక్స్ త్వరలోనే నాకు శక్తి ఉత్సాహములను కలిగించింది. ఇప్పుడు నేను ఓపికతో చురుకుగా పని చేయడం చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!





**హార్లిక్స్ వాడడం వల్ల శక్తి ఉత్సాహాలతో వున్నాను!**

సరైన పోషణ లేక పోవడం వల్ల కలిగే నీరసము, అలసట కొన్ని సమయాల్లో ఉద్యోగమునకే హాని కలిగించవచ్చు. వీటికి ప్రతివిధిగా డాక్టర్లు హార్లిక్స్ సిఫార్సు చేస్తారు. హార్లిక్స్ అదనపు పోషణత్వాన్ని యిచ్చి శక్తి ఉత్సాహము, మంచి ఆరోగ్యము కలుగచేస్తుంది.




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

# చూడండి, మీకే తెలుస్తుంది...
# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్!




ఫలితములను చూడండి. బట్టలను ఆఖరు సారి జాడించునపుడు కొంచెము టినోపాల్ వేయండి అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు బాల్చీకి సరిపోయే బొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.




® టినోపాల్ జె.ఆర్. గైగి ఎస్.ఎ. బాల్ స్విట్జర్లెండ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగి లిమిటెడ్, పి.ఒ. బాక్స్ 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi SGT-IA/69 Tel

# బ్రిటానియా
# నీస్
## బిస్కట్లు!



పంచదార చల్లబడినవి!
కొబ్బరి చేర్చబడినవి!




కరకరలాడుతూ
రుచిగా వుంటాయి



BBC-8397

బ్రిటానియా

అంటే నాణ్యత









# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి...
# రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎవ్వరూ ప్రకటించబడనట్లు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటె: కాల్గేట్ డెంటల్ క్రీముతో ఒకసారి పళ్ళు తోముకొండేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ గుణము ఉన్నది! ఎంత చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీముతో రోజూ పళ్ళు తోముకొనుటకు పిల్లలు యిష్టపడతారు!




COLGATE
DENTAL CREAM

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్ళకు... ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్టుకంటె కాల్గేట్‌నే కొంటారు!

DC.G.41 TL

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. | *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each calendar month |
| 3. | *Printer's Name* | : | B. V. REDDI |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | Prasad Process (Pvt) Ltd.,<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. | *Publisher's Name* | : | B. VISWANATHA REDDI |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | Managing Partner,<br>Sarada Binding Works,<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 5. | *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 6. | *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS:<br>PARTNERS<br>1. Sri B. Viswanatha Reddi,<br>2. Sri B. L. N. Prasad,<br>3. Sri B. Venugopal Reddi,<br>4. Sri B. Venkatrama Reddy,<br>5. Smt. B. Seshamma,<br>6. Smt. B. Rajani Saraswathi,<br>7. Smt. A. Jayalakshmi,<br>8. Smt. K. Sarada. |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March 1970*

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ ["ప్రాణస్నేహితులు"]లో ఒక గొప్ప జీవిత సత్యం ఉన్నది. స్నేహమూ, ప్రేమా, వాత్సల్యమూ లాటివి ఆదర్శప్రాయంగా ఉండాలని మనం ఆశిస్తాం కాని అవి వాస్తవ జీవితంలో ఎంతో కాలం దక్కవు. స్నేహితుల మధ్యా, భార్యాభర్తల మధ్యా, తండ్రికొడుకుల మధ్యా కొంతకాలం చక్కగా ఉండిన బంధాలు కాలక్రమాన సడలిపోయి పూర్తిగా తెగిపోవటం కూడా జరుగుతుంది. దానికి కారణం ఏమిటో ఈ కథ చెబుతున్నది.

సంపుటి 46 మార్చి '70 సంచిక 3

CHITRA





# విద్యాదానం

ఒక కుగ్రామంలో విష్ణుశర్మ అనే పండితుడుండేవాడు. ఆ గ్రామంలో దాదాపు అందరూ అక్షర జ్ఞానం లేనివాళ్ళే. వారందరికీ విద్య నేర్పాలన్న ఉద్దేశంతో ఆయన తన ఇంటనే బడి పెట్టి, వచ్చిన వారందరికీ చదువు చెప్ప నారంభించాడు. ఇవ్వగలవాళ్ళు తృణమో, పణమో ఇచ్చేవాళ్ళు. బీద విద్యార్థులకు ఆయనే తిండీ, బట్టా కూడా ఇచ్చి చదువు చెప్పేవాడు.

ఇలా ఉండగా ఆ గ్రామానికి పరమానందుడనే మహావిద్వాంసుడు వచ్చాడు. ఎందరో మహారాజుల చేత సత్కారాలు పొందిన ఆ విద్వాంసుడు విష్ణుశర్మ నడిపే గురుకులాన్ని గురించి విని, ప్రత్యేకంగా ఆయనను చూద్దామనే వచ్చాడు. వచ్చినవాడు మూడు రోజులపాటు విష్ణుశర్మకు అతిథిగా ఉండి, ఆయన చేస్తున్న విద్యాదానం గురించి గ్రామ ముఖ్యుల ముందు గొప్పగా పొగడి, తాను ఆస్థానాలలో గడించిన డబ్బు కొంత విష్ణుశర్మకు బహుమానంగా ఇచ్చి తన దారిన తాను వెళ్ళాడు.

పరమానందుడు రావటంతో గ్రామ ముఖ్యులకు విష్ణుశర్మ పట్ల గౌరవం రెట్టింపయింది. వారందరూ విష్ణుశర్మకు బాగా ధన సహాయం చేశారు. ఆ సహాయం మూలంగా విష్ణుశర్మ ఇంకా ఎక్కువ మంది బీద విద్యార్థులను చేరదీసి, వారికి చక్కగా తిండి సౌకర్యాలు ఏర్పాటు చేసి మరింత హెచ్చుగా విద్యాదానం చెయ్యగలిగాడు. ఆ బడికి చుట్టు పక్కల గ్రామాల వాళ్ళు కూడా రాసాగారు.

బడి మంచి ఉచ్చదశలో ఉండగా విష్ణుశర్మ ఆకస్మిక మరణం పొందాడు. బడి నడిపే భారం విష్ణుశర్మ కొడుకైన దేవశర్మ పైన పడింది. దేవశర్మ కూడా తండ్రితో సమానమైన పాండిత్యంగలవాడే, కాని

బి. కుమారస్వామి

అతని బుద్ధి తండ్రి బుద్ధిలాటిది కాదు. విష్ణుశర్మ బడి నడిపిన పద్ధతి దేవశర్మకు నచ్చలేదు. విష్ణుశర్మకు పుష్కలంగా డబ్బు లభించింది. కాని ఆయన దాన్ని తన కుటుంబం సుఖంగా జీవించటానికి వినియోగించలేదు. వచ్చిన విరాళాలన్నిటినీ విద్యార్థుల మీదనే ఖర్చు చేశాడు.

దేవశర్మ అలా చేయదలచలేదు. తాను గురువు అవుతూనే అతను కొన్ని నియమాలు పెట్టాడు. చదువుకునే ప్రతి విద్యార్థీ తన శక్తికి తగినట్టుగా గురుదక్షిణ ఇవ్వాలి; ఎవరి తిండీ, బట్టా వారే చూసుకోవాలి.

ఈ నియమాలు అమలు కాగానే బీద విద్యార్థులు బడి మానుకున్నారు. వాళ్ళే అధిక సంఖ్యలో ఉండటంచేత వాళ్ళు మానగానే బడి తీసిపోయింది. దేవశర్మ ఎక్కువ డబ్బు తెచ్చినవారికి కొంచెం శ్రద్ధగా చదువు చెప్పటమూ, తక్కువ తెచ్చినవారిని అశ్రద్ధ చెయ్యటమూ జరిగింది. పొరుగూళ్ళ విద్యార్థులు మానుకున్నారు. అంతో ఇంతో గురుకట్నం ఇవ్వగలవాళ్ళు కూడా తమకు చదువు రావటంలేదని బడి మానేశారు.

ఈ విధంగా, విష్ణుశర్మ చచ్చిపోయి ఏడాది తిరగక ముందే, ఆయన పెట్టిన బడి దాదాపు మూత బడింది. దేవశర్మ దగ్గిర



ఇద్దరు ముగ్గురు శిష్యులే మిగిలారు. బడికి విరాళాలు నిలిచిపోయాయి. అందరూ పోగా మిగిలిన ఇద్దరు ముగ్గురు శిష్యులు ఇచ్చుకునే గురుకట్నంతో దేవశర్మకు భుక్తికి కూడా జరుగుబాటు కావటం లేదు. అతను ఆశించినదానికి పూర్తిగా విరుద్ధంగా జరిగింది.

ఆ గ్రామంలోనే ఉన్న దేవవ్రతుడనే యువకుడు, విష్ణుశర్మ వద్ద చదువుకున్నవాడు, తాను చాలా బీదవాడై ఉండి, పొలం పని చేసుకుని జీవిస్తూనే రాత్రిపూట పేద పిల్లలను చేర్చి చదువు చెప్ప నారంభించాడు. అతను విద్యార్థుల నుంచి ఏమీ

పుచ్చుకునేవాడు కాడు, చదువు మాత్రం అమిత శ్రద్ధగా చెప్పేవాడు. దేవశర్మ దగ్గిర చదువు మానుకున్నవాళ్ళు చాలామంది రాత్రివేళ అతని బడికి వెళ్ళుతూ వచ్చారు.

దేవవ్రతుడు తన మీది ఈర్ష్య కొద్దీ పోటీ బడి పెట్టి, ఉచితంగా చెబుతానని అమాయకులను నమ్మించి, తాను బాగు పడకపోగా, తాను చదువుకున్న బడికి తీరని ద్రోహం చేశాడని దేవశర్మ ఊళ్ళో చాలా దుష్ప్రచారం చేశాడు. పొలం దున్నుకునే వాడి దగ్గిర నేర్చుకున్న చదువు అదేం చదువని వెటకారం చేశాడు. అతను ఎంత ప్రచారం చేసినా దేవశర్మ వద్దకు విద్యార్థులు మటుకు రాలేదు.

ఇలా ఉండగా, ఒకనాడు దేవశర్మకు విచిత్రమైన వార్త తెలిసింది. మహా పండితుడు పరమానందుడు ఆ గ్రామానికి వచ్చి రెండు రోజులుగా దేవవ్రతుడి ఇంట ఉంటున్నాడట! ఊరి పెద్ద లందరూ దేవవ్రతుడి ఇంటికి వెళుతున్నారట! అక్కడ రోజూ సద్గోష్ఠి జరుగుతున్నదట!

మూడోనాడు దేవశర్మ తాను కూడా దేవవ్రతుడి ఇంటికి వెళ్ళాడు. పరమానందుడు ఊరి పెద్దలతో విద్యాదానం గురించి మాట్లాడుతూ, దేవవ్రతుడు చేస్తున్న కృషిని మెచ్చుకున్నాడు. అన్ని దానాల వంటిదే విద్యాదానం కూడాననీ, విద్యాదాత మహాపురుషుడి కింద జమ అవుతాడనీ, విష్ణుశర్మకు సరి అయిన శిష్యుడూ, వారసుడూ దేవవ్రతుడేననీ అన్నాడు.

పరమానందుడు వెళ్ళిపోయాక దేవవ్రతుడి బడి పెరిగింది. అతనికి అంతులేని విరాళాలు లభించాయి. గ్రామ ప్రముఖుల పిల్లలంతా అతని బడిలో చేరారు. విష్ణుశర్మ లాగే అతను కూడా బీద విద్యార్థులకు తిండీ బట్టా ఏర్పాటు చేసి, కొద్ది కాలం లోనే ఆ గ్రామంలో నిరక్షరు డనేవాడు లేకుండా చేశాడు.






అజ్ఞః సుఖ మారాధ్య స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః
జ్ఞానలవ దుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి 1.

తెలియని మనుజుని సుఖముగ తెలుపందగుః సుఖతరముగ తెలుపగవచ్చున్
తెలిసినవానిః; తెలిసియు తెలియని నరు దెల్ప బ్రహ్మదేవుని వశమే?

ప్రహస్య మణి ముద్ధరేత్ మకరవక్త్ర దంష్ట్రాంతరాత్;
సముద్ర మపి సంతరేత్ ప్రచల దూర్మిమాలాకులం;
భుజంగ మపి కోపితం శిరసి పుష్పవత్ ధారయేత్;
నతు ప్రతినివిష్ట మూర్ఖజనచిత్త మారాధయేత్ 2.

మకర ముఖాంత రస్థమగు మానికమున్ పెకలింపవచ్చు; పా
యక చలదూర్మికానికరమైన మహోదధి దాటవచ్చు; మ
స్తకమున పూవు దండవలె సర్పమునైన ధరింపవచ్చు; మ
చ్చిక ఘటియించి మూర్ఖజన చిత్తము తెల్ప నసాధ్యమేరికిన్.

లభేత సికతాసు తైలమపి యత్నతః పీడయన్;
పిబేచ్చ మృగతృష్ణికాసు సలిలం పిపాసార్దితః;
కదాచి దపి పర్యటన్ శశవిషాణ మాసాదయేత్;
నతు ప్రతినివిష్ట మూర్ఖజనచిత్త మారాధయేత్ 3.

తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు, తవిలి మృగతృష్ణలో నీరు త్రావవచ్చు;
తిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చు; చేరి మూర్ఖుల మనసు రంజింపరాదు.

మూర్ఖులు



# ధనమూ-సుఖమూ

ఒక బస్తీలో ఒక వర్తకు డుండేవాడు. అతను బాగా చదువుకున్నవాడూ, చాలా మంచివాడు కూడానూ. అతను గొప్ప ధనవంతుడు, భారీఎత్తున వర్తకం చేసేవాడు. ఆ కారణంచేత అతనికి క్షణం తీరేది కాదు. వేళకు తిండి ఉండేది కాదు. సంప్రతింపులూ, మదుపులూ, బాకీలూ, జమలూ, లెక్కలూ, క్రయవిక్రయాలూ మొదలైన వాటితో అతనికి రోజల్లా సరిపోయేది. ఒక్కోసారి ఈ ఆలోచనలతో రాత్రి నిద్రకూడా ఉండేది కాదు.

అతని భార్యకు పెద్ద చింతగా ఉండేది. "ఎందుకింత శ్రమ? అహోరాత్రాలు శ్రమ పడకపోతే వ్యాపారం ఆగిపోతుందా? విశ్రాంతి అవసరం," అనే దామె భర్తతో.

"పిచ్చిదానా, ఈ వ్యాపారం పులిని సవారి చెయ్యటంలాటిది? దిగటానికి లేదు. దిగితే పులి మింగేస్తుంది," అనేవాడు భర్త.

ఈ వర్తకుడి ఇంటి సరసన ఒక పేదవాడుండేవాడు. అతను ఎక్కడ పని దొరికితే అక్కడ శరీర కష్టం చేసి, తాను సంపాదించిన కాసిని డబ్బులూ తన భార్య చేతిలో పోసేవాడు. ఆ డబ్బులతో వాళ్ళ పొట్టలు నిండీ నిండనట్టుగా జరుగుబాటవుతూండేది. పగలల్లా శ్రమపడి వచ్చినాక పేదవాడికి మరోవిచారం ఉండేది కాదు. భార్య పెట్టిన కలో, గంజో తాగి ఆరుబయట కూర్చుని రాత్రివేళ ఏకతార మీటుతూ పాటలు పాడేవాడు.

పేదవాడి పాటలు వర్తకుడికి పట్టేవి కావు, కాని వర్తకుడి భార్య వాటిని విని, ఆ పేదవాడి జీవితంలో ఉన్నపాటి ఆనందం తన భర్తకు లేకపోయెనే అని విచారించేది.

ఒకరోజు ఆమె తన భర్తతో ఈ మాటే అన్నది. వర్తకుడు తాను చూస్తున్న పద్దుల పుస్తకం మూసి పెట్టి, "పేదవాడికి తీరిక

ఎస్. సుగుణమణి

జాస్తి అంటారు. ఈ పేదవాడు రాత్రివేళల్లో పాడకుండా చెయ్యాలంటే నాకు క్షణం పట్టదు," అన్నాడు.

"ఏం చేస్తావు?" అని భార్య అడిగింది.

"డబ్బిస్తాను," అన్నాడు వర్తకుడు.

వర్తకుడి భార్య నవ్వి, "డబ్బిస్తే వాడు మరింత సుఖపడతాడు," అన్నది.

"అదేదో చూద్దాం," అన్నాడు వర్తకుడు.

మర్నాడు తెల్లవారుతూనే వర్తకుడు తన నౌకరును పంపి పేదవాణ్ణి పిలిపించి, "ఏమోయ్, మనం ఇరుగు పొరుగున ఉన్నా కలుసుకోవటం పడటం లేదు. ఎలా ఉన్నావు?" అని అడిగాడు.

"తమకు తెలీనిదేముంది? రెక్కాడితే గాని డొక్కాడని బతుకు! ఒళ్ళు హూనం చేసుకున్నా నాలుగు డబ్బులు రాలవు ఏదో ఉన్నంతలో సుఖంగానే బతుకుతున్నాం," అన్నాడు పేదవాడు.

"నేను నీ విషయం కొంతకాలంగా ఆలోచిస్తున్నాను నువు కాయకష్టం చేసి బతకటం నాకేమీ బాగాలేదు నీకు అయిదు వందల తులాల వెండి ఇస్తాను. దానితో లాభసాటి వ్యాపారం ఏదన్నా చేసుకుని, నువూ, నీ భార్యా సుఖంగా బతకండి," అంటూ వర్తకుడు పేదవాడి చేతికి డబ్బిచ్చాడు.



పేదవాడికి తన కృతజ్ఞత ఎలా తెలుపుకో వాలో కూడా తెలియలేదు అతను ఎలాగో సెలవు పుచ్చుకుని, డబ్బుతో సహా తన ఇంటికి పరిగెత్తాడు.

ఆరోజు అతను పనికి పోలేదు. ఆ డబ్బును ఎలా వినియోగించాలా అని భార్యా భర్తలు రోజల్లా వితర్కించు కున్నారు. మార్గాలు చాలా కనిపించాయి, కాని వాటిలో ఏది ఉత్తమమో ఎంత ఆలో చించినా తెలియలేదు.

ఆ రాత్రి వాళ్ళు వేళకు తిండి కూడా తినలేదు. అలస్యంగా తింటున్నా పేదవాడికి ఆకలి తెలియలేదు, తినేది రుచీ తెలియ లేదు. ఆ రాత్రి అతను ఏకతార మీటుతూ పాటలు కూడా పాడలేదు.

ఆ రాత్రి పేదవాడికి నిద్ర పట్టలేదు. పక్క మీద అటూ ఇటూ తెగ పొర్లాడు. తెల్లవారి లేస్తూనే డబ్బు భద్రంగా ఉన్నదీ లేనిదీ చూసుకున్నాడు.

ఇలాగే మూడు రోజులు గడిచాయి. అకస్మాత్తుగా పేదవాడికి జ్ఞానోదయం కలిగి నట్టయింది. అతను డబ్బు తీసుకుని వర్తకుడి ఇంటికి వెళ్ళాడు.

"ఏమయింది? డబ్బు ఎలా వినియో గించాలో నిశ్చయించుకున్నావా?" అని వర్తకుడు పేదవాణ్ణి అడిగాడు.

"నిశ్చయించు కున్నాను, బాబయ్యా. దాన్ని తమరే తీసుకోండి. తమ మేలు మరవను," అంటూ పేదవాడు డబ్బు వర్తకుడి ముందుంచి, వెళ్ళిపోయాడు.

మూడు రోజుల తరవాత అతను మళ్ళీ ఒళ్ళు వంచి పని చేస్తూంటే అతని మనస్సు ఎంతో తేలికనపడ్డట్టయింది. ఆ రాత్రి అతను ఆరుబయట కూర్చుని, ఏకతార మీటుతూ గొంతెత్తి గట్టిగా పాడాడు.

వర్తకుడి భార్య ఆ పాటలు వింటూ, తన భర్తకు ఆపాటి ఆనందం లేనందుకు కంట తడి పెట్టుకున్నది.






# శిథిలాలయం

## 27

[వృశ్చికలంకకు పోయేవారిలో ఒకచోట, జాంగ్లా శిఖిముఖీ వాళ్ళకు తటస్థపడ్డాడు. తనను శిథిలాలయపూజారి చంపజూశాడని అతడు శిఖిముఖికి చెప్పాడు. సూర్యోదయంతో అందరూ తిరిగి ప్రయాణమయారు. ఒక లంక మలుపులో, పూజారి పడవలు వాళ్ళకు కనిపించినై. విక్రమకేసరి పూజారి కేసి బాణాలు వదలసాగాడు. తరవాత—]

విక్రమకేసరి వదిలిన బాణాలు శిథిలాలయ పూజారిక్కాదుగదా, అతడున్న పడవ క్కూడా తగలలేదు. జలజంతువు కదలిక వల్ల లేచే నీటి అలల మీద పూజారి పడవలు అటూ యిటూ ఒరుగుతూ వేగంగా కొట్టుకు పోతున్నవి. జలజంతువు తానంతకు ముందు పట్టుకుతిన్న వాడితో కాస్త తృప్తిపడినట్టుగా, పడవలను లోగడంత వేగంగా తరమటం లేదు. ఒకటి రెండు నిమిషాలు గడిచినై. జలజంతువు నీటిలో వున్న చోటునే ఆగి, మెడ అటూ యిటూ తిప్పి ఓసారి చుట్టూ కలయ జూసింది.

ఆ భయంకర జంతువు దృష్టి తమమీద పడుతుందేమో అన్న భయంతో శిఖిముఖీ అతడి అనుచరులూ, దాపులనున్న రెల్లు పొదలచాటుకు తప్పుకున్నారు. ఎర్రగండు మొరగకుండా శిఖిముఖి దాని తల నిమర సాగాడు. అతడికి జలజంతువు తమను



ఆగి, శిఖిముఖివాళ్ళు దాగిన చోటునుంచి బయిటికి వచ్చి, తిరిగి తమ పడవల మీదికి వెళ్ళారు.

తమ ప్రయాణం జంతువు వెళ్ళిన దిక్కు కాకపోవటం వాళ్ళకు కొంత ధైర్యాన్నిచ్చింది. కాని, ఈ జలమయ ప్రదేశంలో అటువంటి భయంకర ప్రాణులు మరికొన్ని వుండవచ్చున్న అనుమానం వాళ్ళను బాధించసాగింది. వీటన్నిటికి తోడు శిథిలాలయ పూజారి తమ ప్రయాణాన్ని ముందుగానే పసి గట్టటం — అన్నిటినీ మించిన సంకటాన్ని తెచ్చి పెట్టవచ్చు.

పట్టుకుని కబళిస్తుందన్న భయంకన్న, ఒడ్డున వున్న తమ పడవల్ని నీట ముంచు తుందేమో అన్న భయం అధికంగా వున్నది. అలా జరిగితే, తాము యీ నిర్జనమైన లంక మీద చిక్కుకుపోతారు...

చూస్తూండగానే శిథిలాలయ పూజారి వున్న పడవలు లంక మలుపు తిరిగి, కన బడకుండా పోయినై. జలజంతువు తృప్తిగా ఒళ్ళు విరుచుకుంటున్నట్టు నీటిలో అటూ యిటూ కొంచెం సేపు పొర్లి లేచి, తల మాత్రం నీటి బయిటికి పెట్టి, దూరంగా వున్న మరో చిన్న లంక కేసి బయలు దేరింది. అది కనబడకుండా పోయేవరకూ

పడవలు రెండూ కదలబోయే సమ యంలో శిఖిముఖి అందరికీ వినబడేంత పెద్ద గొంతుతో, "వృశ్చికలంకకు వెళ్ళా లనే ప్రయత్నంలో వున్న సాధకబాధకాలు, ఈసరికి అందరికీ తెలిసి వచ్చినై అను కుంటాను. నేనూ, కేసరీ ఏ పరిస్థితుల్లోనూ అక్కడికి వెళ్ళక తప్పదు. కాని, మిగతా వాళ్ళెవరైనా, ఇక్కడ దిగబడిపోదలిస్తే నా అభ్యంతరం లేదు. తిరుగు ప్రయా ణంలో అలాంటివాళ్ళను తీసుకుపోతాం. ఈలోపల వాళ్ళకు అవసరం అయిన ఆహారపదార్థాలు యీ లంకలో వదు లుతాం," అన్నాడు.

ఈ మాటలకు ఒక్క క్షణం అందరూ ఆశ్చర్యపోయారు. నాంగ్‌సోమ్, అజిత వీరభద్రులతోపాటు, కుంటి జాంగ్‌లా కూడా ఎన్ని కష్టాలు ఎదుర్కోవలసి వచ్చినా, వృశ్చికలంకకు వెళ్ళితీరవలసిందే అన్నాడు. శిథిలాలయ పూజారి అంతం చూడవలసి వున్నదనీ, కనక తాను ఒంటరిగానైనా సరే, వృశ్చిక లంకకు వెళ్ళక తప్పదనీ అన్నాడు, జాంగ్‌లా.

తమ అనుచరుల పట్టుదలనూ, ధైర్యాన్నీ, విశ్వాసాన్నీ శిఖిముఖీ, విక్రమకేసరులు మెచ్చుకున్నారు.

పడవలు కదిలినై. గాలి అనుకూలంగా వుండటంతో తెరచాపలు ఎత్తారు. తమకన్న ముందు లంక మలుపు తిరిగిపోయిన పూజారి వాళ్ళ పడవల కోసం అందరూ జాగ్రత్తగా చుట్టు పక్కల ప్రదేశాన్ని పరీక్షించసాగారు. కాని, సూర్యాస్తమయ సమయమవుతున్నా వాళ్ళకు పూజారి పడవలు ఎక్కడా తారస పడలేదు. చీకటి పడుతూండగా పడవలను ఒక చిన్న లంక ప్రదేశాన ఒడ్డు చేర్చి, తాళ్ళతో వాటిని ఒడ్డునున్న చెట్లకు కట్టి, ఆ దాపులనే అందరూ వంట ప్రయత్నాలు ప్రారంభించారు.



వంట పూర్తయి అందరూ భోజనాలు చేసేసరికి జాముపొద్దు గడిచిపోయింది. ఈ లంక తీరంలో మొసళ్ళున్న సూచనలు లేవు. కాని, లంక మీది చెట్టు చేమల్లో మాత్రం అనేక రకాల నీటిపక్షులు వున్నవి. అవి పొద్దు పోతున్నకొందికీ మరింత బిగ్గరగా గీబా అంటూ గోల చేయసాగినై.

నెగడు వెలిగించి శిఖిముఖీ అతడి అనుచరులూ దాని చుట్టూ చేరి మాట్లాడుకోసాగారు. వాళ్ళ కల్లంత దూరంలో పడవలు రెండూ అలల తాకిడికి లేచి పడుతూ, ఆ చీకట్లో నాట్యం చేస్తున్న రెండు పెద్ద భూతాల్లా కనిపిస్తున్నవి. కొంచెం సేపు



మాట్లాడుకున్న తరవాత ఒకరొకరుగా శిఖిముఖీ వాళ్ళు నెగడు చుట్టూ ముడుచుకు పడుకున్నారు. రెండవ జాముున కాపలా పని నాంగ్‌సోముది.

నాంగ్‌సోమ్ ఈటె పట్టుకుని ఒకసారి పడవల దగ్గిరకుపోయి చూసి, తిరిగి నెగడు దగ్గిరకు వచ్చి కూచున్నాడు. నీటిపక్షులు చేసే గోల అతడికి తల దిమ్మెత్తిస్తున్నది. అతడొకసారి బద్ధకంగా ఆవిలించి, పక్కనే నిలబడి వున్న ఎర్రగండు తలను నిమరబోయాడు.

ఎర్రగండు మెడ పక్కకు తిప్పి, పడవలున్న దిక్కుకేసి ఓ అడుగువేసి, గాలిలో



తలను అటూ యిటూ ఓమారు తిప్పి చిన్నగా మొరిగింది. పసికట్టటంలో ఎర్రగండు కున్న శక్తి బాగా తెలిసినవాడు కావటంతో నాంగ్‌సోమ్, అది తల తిప్పిన దిక్కుకేసి పరీక్షగా చూశాడు. పడవల్లో ఒకటి ఓ క్షణకాలం పక్కకు ఒరిగి, రెండవ దాన్నుంచి కొంచెం దూరం కదిలినట్టు అతడికి తోచింది.

నాంగ్‌సోమ్ ఎర్రగండు మొరగ కుండా దాని తల నిమిరి, ఈటెను గట్టిగా గుప్పెట బిగించి, నేల మీద వంగి నడుస్తూ పడవల దగ్గిరకు వెళ్ళాడు. అతడింతకు ముందు చూసినట్టు ఒక పడవ రెండవ దానికి భిన్నంగా నీటి మీద వుండి వుండి చప్పున ఒక పక్కకు ఒరిగి, మళ్ళీ యథాప్రకారం నిలబడుతున్నది.

పడవ కింద ఏవో మొసళ్ళు చేరి పోట్లాడుకుంటున్నవేమో అన్న అనుమానం నాంగ్‌సోమ్‌కు కలిగింది. కాని, పరీక్షగా చూడగా అక్కడ నీటిలో పెద్ద కదలిక ఏమీ అతడికి కనిపించలేదు. దానితో అతడికి శత్రువెవరో పడవ కింద దాగివుండి పడవకు చిల్లి పొడవటమో, లేక దొంగిలించుకు పోవాలనే ప్రయత్నమో చేస్తున్నాడన్న అనుమానం కలిగింది.



నాంగ్‌సోమ్ ఎర్రగండును నీటి ఒడ్డునే వుంచి, నిశ్శబ్దంగా నీటిలో దిగి పడవను చేరి, దానిమీద ఎక్కి నిలబడ్డాడు. ఆ సమయంలో పడవ కొంచెంగా అటూ యిటూ ఒరిగింది. వెంటనే దాని అడుగు నుంచి ఒక నల్లని ఆకారం చప్పున నీటిమీదికి తేలింది. గుడ్డివెన్నెట్లో ఒకరినొకరు గుర్తించారు.

కన్ను మూసి తెరిచేంతలో నాంగ్‌సోమ్ చేతిలోని ఈటెను బలంగా ఆ నల్లని ఆకారం కేసి విసిరాడు. అదే సమయంలో నీటిలో వున్నవాడు చప్పున ఈటెను నాంగ్‌సోమ్ మీదికి ప్రయోగించాడు. ఆ ఈటె పడవ అంచును తాకటం, నాంగ్‌సోమ్ ఈటె వాడి వెన్నులో దిగబడటం ఒకేసారి జరిగిపోయింది.

నీటిలో వున్నవాడు ఒక్క చావుకేక పెట్టాడు. వెంటనే నాంగ్‌సోమ్ నీటిలోకి దూకి వాణ్ణి చేతులతో బలంగా పట్టుకుని ఒడ్డు కేసి ఈడ్చుతూ, పెద్ద గొంతుతో, "శత్రువులు! శత్రువులు!" అని కేకలు పెట్టసాగాడు.

ఆ కేకలు వింటూనే శిఖిముఖివాళ్ళు అదురుకుంటూ నిద్రలు లేచి నాంగ్‌సోమ్ వున్న చోటుకు పరిగెత్తు కొచ్చారు. ఆ సరికి నాంగ్‌సోమ్ గాయపడినవాణ్ణి బాగా ఒడ్డు మీదికి ఈడ్చుకు వచ్చాడు. వాడి వెన్నులో దిగిన ఈటె అలాగే దిగబడివున్నది. వాడు బాధతో ఆయాస పడుతున్నాడు. అజితుడి చేతిలో వున్న కాగడా తీసుకుని, దాని కాంతిలో శిఖిముఖి వాడి ముఖం పరీక్షించి చూశాడు. వాడు మరెవరో కాదు, తిమ్మ గూడెం ప్రాంతాలగల అడవుల్లో దారి దొంగల్లా బతికే ముఠాలోనివాడు. ఆ ముఠా వాళ్ళు ఇద్దరు ముగ్గురు శిథిలాలయ పూజారి బంట్లుగా గోల్‌ఖరా వచ్చారు.

నాంగ్‌సోమ్, శిఖిముఖికి జరిగిందంతా ఒకటి రెండు మాటల్లో టూకీగా చెప్పేశాడు.

శిఖిముఖి దొంగతో, "నువ్వు చేసిన దురంతాలకు తగిన చావే నీ కెదురైంది. నీ వెన్నులో దిగబడి వున్న ఈటెను లాగేయించుతాను, కాని వెంటనే చస్తావు. చచ్చేముందు ఒక్క మాట చెప్పు. మా పడవలకు అడుగున చిల్లులు పొడిచి ముంచాలనే గదా నువ్వొచ్చింది? పూజారి ఏ లంకలో దిగాడు?" అని ప్రశ్నించాడు.

దొంగ ఓసారి మూలిగి మొదటి ప్రశ్నకు అవునన్నట్టు తల వూపి, అక్కడికి దాపులనే వున్న మరొక లంక కేసి బాధగా చేయి ఎత్తి చూపాడు. ఆ వెంటనే శిఖిముఖి, నాంగ్‌సోమ్‌ను ఈటె లాగివేయమన్నాడు. నాంగ్‌సోమ్ ఈటెను వెన్నులోనుంచి బయిటికి గుంజగానే, దొంగ గిలగిలా ఓ క్షణకాలం తన్నుకుని కొయ్యదుంగలా నిగడదన్నుకుపోయాడు.

"శిఖీ! ఆ పూజారి వెధవ లోగడ మనను అరణ్యంలో వెన్నంటి గోల్‌ఖరా వచ్చినట్టే, యిప్పుడు వృశ్చికలంక కూడా మన వెనకనే వస్తున్నాడు!" అన్నాడు విక్రమకేసరి.

'వాడు వూరికే రావటం లేదు, దారిలోనే మనను నాశనం చేయాలని చూస్తున్నాడు. మన పడవల్ని నీటముంచితే,



మనం యీ దిక్కుమాలిన లంక మీద ఆకలికి అలమటించి చస్తామని వాడి ఆశ. ఏమైనా, యిక ముందు మనం పడవల విషయంలో మరింత గట్టికాపలా ఏర్పాటు చేసుకోవటం క్షేమం," అన్నాడు శిఖిముఖి.

నాంగ్‌సోమ్ ఆ చీకట్లోనే శిథిలాలయు పూజారి దిగిన లంకకుపోయి, వాణ్ణి హతమార్చటం బావుంటుందని సలహాయిచ్చాడు. కాని, ఆది కేవలం దుస్సాహసం అవుతుందనీ, ఏ చెట్టుచాటునో వుండి, వాడూ, వాడి అనుచరులూ తమ మీద దొంగదెబ్బ తీయగలరనీ శిఖిముఖి చెప్పి—ఆ ఆలోచనను వ్యతిరేకించాడు.

ఆ రాత్రి మరే అవాంతరం లేకుండా తెల్లవారి పోయింది. శిఖిముఖీ అతడి అను చరులూ పడవలను సిద్ధంచేసి, ముందుగా దొంగ చెప్పిన లంకను సమీపించి, జాగ్ర త్తగా దాని మీద దిగారు. వాళ్ళు ఎంతో వెతకగా ఒకచోట రాత్రి పూజారి ముఠా వాళ్ళు వేసుకున్న నెగటి గుర్తులు మాత్రం కనిపించినై. వాళ్ళు ఏ తెల్లవారుజామునో లంక వదిలిపోయారు.

తరవాత నాలుగు రోజులపాటు వాళ్ళు చిన్నా పెద్ద లంకల పక్కగా ప్రయాణం చేసి, అయిదవనాటి సంధ్యాసమయానికి, ఎత్తయిన కొండలతో, మహావృక్షాలతో వున్న ఒక పెద్ద లంకను చూశారు. ఈ మధ్య కాలంలో వాళ్ళకు శిథిలాలయ పూజారి వున్న పడవలు ఎక్కడా కనబడలేదు.

తాను తన జాతి ఇభ్యుపెద్దల ద్వారా విన్న వృశ్చికలంక యిదేనని నాంగ్‌సోమ్ గుర్తించాడు. అతడు యిదే వృశ్చికలంక అని శిఖిముఖీ, విక్రమకేసరులతో చెప్పగానే, వాళ్ళు ఎక్కడలేని సంతోషంతో పడవలను తీరానికి నడపమన్నారు.

కొద్దిసేపటి తరవాత పడవలు రెండూ తీరాన్ని చేరినై. అందరూ పడవల్లోంచి ఒడ్డుకు దిగారు. ఇంకా వెలుతురు వుండ గానే, దాపుల నున్న కొండ ఎక్కి లంక ఎలా వున్నదీ చూసేందుకు విక్రమకేసరీ, శిఖిముఖీ బయలుదేరారు. మిగతావాళ్ళు పడవల దగ్గిరే వుండిపోయారు.

వాళ్ళిద్దరూ కొండ పై భాగం చేరి, దూరంగా లంకలో అంతకన్న చాలా ఎత్తుగా వున్న మరికొన్ని కొండల కేసి కొంచెం సేపు చూసి, వెనుదిరగబోయేంతలో వాళ్ళదృష్టి దిగువనున్న చిన్న గుట్ట మీద పడింది. ఆ వెంటనే వాళ్ళకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. ఆ గుట్ట మీద పాడుబడి కూలిపోవటానికి సిద్ధంగా వున్న ఒక దేవా లయం వున్నది. —(ఇంకా వుంది)






# ప్రాణస్నేహితులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, సామాన్య మానవులకు అపూర్వమైన అనుభవాల వల్ల సుఖం కన్న కష్టమే హెచ్చుగా కలుగుతుంది. ఇందుకు నిదర్శనంగా శౌనక మౌద్గల్యుల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం స్వర్ణనదీ తీరాన ఒక గ్రామంలో శౌనకుడూ, మౌద్గల్యుడూ అనే వాళ్ళుండే వాళ్లు. వాళ్ళు ప్రాణస్నేహితులు. ఒక్క క్షణం కూడా ఒకరిని విడిచి ఒక రుండే వారు కారు. ఏ కారణం చేతనైనా ఒకనాడు వారిద్దరూ కలుసుకుని కబుర్లు చెప్పుకోవటం పడకపోతే ఆ రోజు వారిద్దరికీ దుర్ది

## బేతాళ కథలు





నంగా ఉండేది. ఏ ఒకరికైనా గ్రామాంతరాన పని పడితే, ఇద్దరూ వెళ్లేవాళ్ళు.

ఇలా ఉండగా మౌద్గల్యుడు మరణించాడు. శౌనకుడు తన స్నేహితుడి శవం పైన పడి దారుణంగా విలపించాడు. నలుగురు బలాఢ్యులు శౌనకుణ్ణి బతిమాలి లాభం లేక పట్టి ఇవతలికి లాగితేనే గాని మౌద్గల్యుడి శవాన్ని ఇంటి నుంచి కదిలించటం సాధ్యం కాలేదు.

తన ప్రాణస్నేహితుడి మరణంతో శౌనకుడు కుంగి పోయాడు. అతనికి జీవితమంతా అంధకారమై పోయినట్టు అనిపించింది.

ఇంతలో ఒక రాత్రి శౌనకుడికి ఒక కల వచ్చింది. ఆ కలలో మౌద్గల్యుడు కనిపించాడు. అతను అద్భుతమైన దేవతా వస్త్రాలు ధరించి ఉన్నాడు. అతను శౌనకుడితో, "మిత్రమా, నాకు యమలోకంలో పెద్ద పదవి ఇచ్చారు. అక్కడ నేను చాలా అధికారాలు గలిగి ఉన్నాను. అందుచేత మన స్నేహానికి అంతరాయం లేకుండా రోజూ మనం అక్కడ కలుసుకునే ఏర్పాటు చేశాను. నువ్వు పడుకోబోయేటప్పుడు ఒక మంత్రం చదివితే, నిద్రలో ఉన్నంత సేపూ యమలోకానికి వచ్చి నాతో కాలక్షేపం చెయ్యవచ్చు," అని చెప్పి, మంత్రం ఉపదేశించాడు.

మర్నాడు ఉదయం శౌనకుడు నిద్ర లేస్తూనే తన మనసు చాలా తేలికపడ్డట్టు గ్రహించి, తాను కన్న కల వాస్తవమై ఉండాలనుకున్నాడు. ఆ రాత్రి అతను పడుకుని నిద్రపోయే ముందు, తన మిత్రుడు కలలో చెప్పిన మంత్రం చదివాడు. తరవాత కొద్ది సేపట్లోనే అతను యమలోకంలో ఉన్నాడు. మౌద్గల్యుడు అతనికి ఎదురు వచ్చి, స్వాగతం చెప్పి, తన వెంట తీసుకు పోయాడు. ఇద్దరూ వెనకటిలాగే కబుర్లు చెప్పుకుంటూ చాలాసేపు కాలక్షేపం చేశారు.



తిరిగి తెల్లవారి నిద్ర మెలకువ వచ్చేసరికి శౌనకుడు తన ఇంటనే ఉన్నాడు.

అది మొదలు ప్రతి రాత్రీ అతను పడుకో బోయేటప్పుడు మంత్రం చదివి, యమ లోకానికి వెళ్ళి, మౌద్గల్యుడితో ఇష్టాగోష్ఠి జరుపుతూ వచ్చాడు. మౌద్గల్యుడు చని పోయాడన్న విచారం అతనిలో ఏమాత్రమూ లేకుండా పోయింది.

ఇలా ఉండగా ఒకరాత్రి శౌనకుడి పక్కలో అతని మనమడు, అయిదేళ్లవాడు పడుకున్నాడు. తాత చదివిన మంత్రం విని వాడు కూడా చదివాడు. శౌనకుడు యమ లోకంలో తన వెంట తన మనమడు కూడా ఉండటం చూసి కాస్త కంగారు పడ్డాడు. అయితే ఆ కుర్రవాడు మాత్రం ఏమీ జంక లేదు కొంత దూరాన అనేకమంది పిల్లలు ఆడుకుంటూ ఉండటం చూసి, వాడు వాళ్ల కేసి పరిగెత్తి, వాళ్ళ ఆటలలో చేరిపోయాడు.

అది చూసి శౌనకుడి మనసు కుదుట పడింది. అతను మామూలు ప్రకారమే మౌద్గల్యుణ్ణి కలుసుకుని అతనితో కబుర్లు చెబుతూ ఉండిపోయాడు. కాని తెల్లవారి తీరా అతను నిద్ర లేచి చూసేసరికి, మంచంలో అతని పక్క తన మనమడి నిర్జీవకళేబరం మటుకే ఉన్నది. యమ



లోకంలో నుంచి తాను తిరిగి వచ్చాడు గాని, తన మనమడు అక్కడే దిగబడి పోయాడు! మళ్ళీ రాత్రి అయినదాకా తాను ఏమీ చెయ్యటానికి లేదు.

ఇంట్లో ఆడవాళ్ళు పిల్లవాడు పోయి నందుకు శోకాలు పెట్టారు.

"మీరేమీ అదుర్దా పడకండి. రేపీపాటికి వాడు బతుకుతాడు," అన్నాడు శౌనకుడు. పిల్లవాడి చావుకు శౌనకుడే కారణమై ఉంటాడని వాళ్ళు అనుమానించసాగారు.

శౌనకుడికి ఆ పగలు ఒక యుగంలాగా గడిచింది. రాత్రి పడుకుని మంత్రం చదివి యమలోకం చేరుతూనే శౌనకుడు తన



మిత్రుణ్ణి కలుసుకుని, "నిన్న నావెంట వచ్చిన నా మనమడు ఇక్కడే దిగబడిపోయాడు. వాడి కోసం వెతికించు," అన్నాడు.

"ఎక్కడని వెతికించను? అది సాధ్యమయే పని కాదే!" అన్నాడు మౌద్గల్యుడు.

"ఎందుకు సాధ్యం కాదు? కుర్రవాడే మన్నా ఉట్టుడియంగా మాయమౌతాడా?" అన్నాడు శౌనకుడు.

"అది అసంభవం కాదే," అన్నాడు మౌద్గల్యుడు, యమలోకపు వ్యవహారాలు తెలిసినవాడు కనక.

ఈ జవాబుతో శౌనకుడి ఆరాటం హెచ్చిపోయింది.

"ఎలాగైనా సరే, నా మనమడి ఆచోకీ తెలుసుకుంటే కాని నేను ఇంటికి తిరిగి పోవటానికి లేదు. వాడి దుస్థితికి నేనే కారణం," అన్నాడు శౌనకుడు.

"జనన మరణాల చిఠా చూస్తేగాని తెలదు. మనం చిత్రగుప్తుడి కార్యాలయానికి వెళదాం," అన్నాడు మౌద్గల్యుడు.

చిత్రగుప్తుడి వద్ద అంతులేని జాబితాలున్నాయి. వాటిని తిరగ వెయ్యటానికి చాలా కాలం పట్టింది.

"అమ్మయ్య, నీ మనమడి అజ దొరికింది, అదృష్టం! నువ్వుండే గ్రామం పక్క గ్రామంలో ఒక పంది ఈ రాత్రే పదమూడు పిల్లల్ని ఈనుతుంది. అందులో ముఖాన తెల్ల మచ్చగల పిల్లగా నీ మనమడు పుడుతున్నాడు," అన్నాడు మౌద్గల్యుడు.

"అదా అదృష్టం?" అన్నాడు శౌనకుడు నివ్వెరపోయి.

"నా ఉద్దేశం మరేమీ లేదు. నువు తెల్లవారుతూనే ఆ గ్రామానికి వెళ్ళి ఆ పంది పిల్లను చంపేసినట్టయితే నీ మనమడు తిరిగి బతుకుతాడు," అన్నాడు మౌద్గల్యుడు.

మరు క్షణంలోనే శౌనకుడికి మెలకువ వచ్చింది. అతను అప్పటికప్పుడే బయలుదేరి పొరుగూరికి వెళ్ళి, ఆ రాత్రి ఈనిన

పంది గురించి విచారించి, దాని పిల్లలను లెక్కపెట్టి చూసుకుని, తెల్ల మచ్చగల దాన్ని డబ్బిచ్చి కొని, అక్కడే దాన్ని చంపి ఇంటికి తిరిగి వచ్చాడు. శౌనకుడు తిరిగి వచ్చేసరికి అతని మనమడు ఎప్పటిలాగే ఇంట్లో ఆడుకుంటూ కనిపించాడు. శౌనకుడి ఆరాటం తీరిపోయింది. కాని ఆటు తరవాత అతను ఎన్నడూ యమలోకానికి వెళ్ళలేదు, తన ప్రాణస్నేహితుణ్ణి కలుసుకోనూ లేదు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. శౌనకుడికి యమలోక యాత్రల వల్ల నష్టమేమీ కలగకపోగా ఒక విధంగా మేలే జరిగింది కదా, అతను తన ప్రాణ స్నేహితుణ్ణి చూడటం అకస్మాత్తుగా ఎందుకు మానుకున్నాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శౌనకుడి మనమడు యమలోకానికి వెళ్ళటానికి గాని, దారి తప్పి పంది కడుపున పుట్టటానికిగాని మౌద్గల్యుడు ఏమాత్రమూ బాధ్యుడు కాడు. అందుచేత శౌనకుడికి ఆ స్నేహితుడి పైన ఆర్ద్రత తగ్గటానికి వేరే కారణం వుండాలి. అదేమిటంటే, యమలోకంలో ఉద్యోగి అయినాక మౌద్గల్యుడి మానవ దృక్పథం పూర్తిగా మారిపోయింది. జనన మరణాలూ, ఉత్తమ జన్మలు హీన జన్మ లెత్తటమూ అతనికి పరిపాటి అయిపోయింది. శౌనకుడిలో మానవతత్వం ఇంకా మారలేదు. తమ ఇద్దరి మన స్తత్వాలలోనూ ఏర్పడిన తేడాను శౌనకుడు, తన మనమడు పంది జన్మ ఎత్తటం గురించి మౌద్గల్యుడి వైఖరిని బట్టే తెలుసుకో గలిగాడు. ఆ తరవాత ఇద్దరి మధ్యా ఉండిన స్నేహభావం సడలటం సహజమే," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# పోరు నష్టం

ఒక వేసవి రోజున అరణ్యంలో ఉన్న ఒక మడుగులో నీరు తాగటానికి ఒక సింహమూ, ఒక అడవిపందీ ఒకేసారి వచ్చాయి. అడవిపంది కొంచెం ముందుగా రావటంచేత, అది ముందు నీరు తాగబోయింది. కాని సింహం దాన్ని పక్కకు నెట్టేసి, "నా దాహం తీరినాక నువు తాగు," అన్నది.

"నేను ముందు వచ్చాను. నేను తాగినాకనే నీ వంతు," అన్నది అడవిపంది.

"నాకు ఎదురు చెప్పావంటే పంజాదెబ్బ తినగలవు," అన్నది సింహం.

"నా కోరలతో నీ డొక్క చీరెయ్యగలను, జాగ్రత్త," అన్నది అడవిపంది.

రెండూ కలియబడి ఒకదాన్ని ఒకటి చీల్చి చెండాడసాగాయి.

ఇంతలో చెట్లమీద రెక్కల చప్పుడు వినిపించి, సింహం పైకి చూసింది. రాబందులు కనిపించాయి. ఏ జంతువు ముందు చస్తుందా అని అవి ఆత్రంగా వేచి ఉన్నాయి.

"మన కెందుకు పోట్లాట? రాజీ పడదాం," అన్నది సింహం.

"నేను వద్దన్నానా?" అన్నది అడవిపంది.

రెండూ ఒకేసారి నీరుతాగి తమ దారిన పోయాయి.






# కాజీ చేసినమోసం

చాలాకాలం క్రితం ఘజ్నీనగరాన్ని సుల్తాన్ మహమ్మద్ పాలిస్తూ ఉండగా ఒక వర్తకుడు అజర్బాయ్‌జాన్ నుంచి హిందూదేశానికి ప్రయాణమై వస్తూ ఘజ్నీనగరం చేరాడు. ఆ నగరం అతనికి నచ్చింది; అందుచేత అక్కడే స్థిరపడి తన వృత్తి అయిన వర్తకం చేసుకుందామని నిశ్చయించుకున్నాడు. వర్తకం బాగా అనుకూలించగా అతను కొద్ది కాలంలోనే సంపన్నుడై, మంచి అందమూ, సుగుణ సంపత్తి గల కన్యను వివాహమాడి సుఖంగా జీవించసాగాడు.

కొంతకాలం జరిగింది. అతని వర్తకం దినదినాభివృద్ధి చెందింది. అతని సరుకులు హిందూదేశానికి కూడా ఎగుమతి అయాయి. తరవాత అతను స్వయంగా హిందూదేశానికి వెళ్ళి వర్తకపు వ్యవహారాలు చక్కబెట్టవలసిన అవసరం ఏర్పడింది.

తాను చెయ్యనున్నది దీర్ఘ ప్రయాణం. దాదాపు ఒక ఏడాదిపాటు తన భార్యను ఎవరి వద్దనైనా ఉంచాలంటే నగరంలో తనకు బంధువు లెవరూ లేరు.

నగరంలో ఒక కాజీ (న్యాయాధికారి) ఉన్నాడు. ఆయన చాలా నీతిపరుడూ, మహా పవిత్రుడూ అని చెప్పుకునేవారు. అందుచేత వర్తకుడు ఆ కాజీ వద్దకు వెళ్ళి, "తమరు ధర్మమూర్తులని లోక మంతా చెప్పుకుంటున్నది. నేను వ్యాపారం మీద ఒక సంవత్సరంపాటు దేశాంతరాలకు పోతున్నాను. అంతకాలమూ న భార్యను మీ యింట ఉంచుకుని కాపాడ పార్థన. ఆమె కయే ఖర్చు ఇచ్చి మరీ బయలుదేరుతున్నాను," అన్నాడు.

అందుకు కాజీ సంతోషంగా ఒప్పుకున్నాడు. వర్తకుడు తన భార్యను కాజీ ఇంట వదిలి వెళ్ళిపోయాడు.

---

పర్షియా జానపద కథ




వర్తకుడి భార్య సంవత్సరంపాటు కాజీ ఇంట దైవధ్యానం చేస్తూ ఎలాటి దుర్ఘటనలూ లేకుండా గడిపేసింది. కాని అంతలో కాజీ ఆమెను చూడటం జరిగింది. ఆమె అందం చూసి, కాజీకి దిగ్భ్రాంతి కలిగింది. అతని సద్బుద్ధి కాస్తా హరించుకు పోయింది. వర్తకుడి భార్యను ఎలాగైనా వంచించాలన్న దుర్బుద్ధి బలంగా తలఎత్తింది.

ఒకనాడు కాజీ భార్య ఇంటిని వర్తకుడి భార్యకు అప్పగించి, ఎక్కడికో వెళ్ళింది. ఈ సంగతి కాజీకి ముందే తెలిసి, అతను వేళగానివేళ ఇంటికి తిరిగి వచ్చాడు. అతను తిన్నగా వర్తకుడి భార్య ఉన్న గదిలోకి వెళ్ళి, "నేను ఎంతో పాపభీతి గలవాడిననీ, ధర్మచింత గలవాడిననీ లోకమంతా ఎరుగును గదా, నా ఎదటపడటానికి ఎందుకు నీకు సంకోచం? నన్ను చూసి భయపడటం అన్యాయం," అన్నాడు.

ఈ మాటలతో వర్తకుడి భార్యకు కొంత ధైర్యం వచ్చింది.

"నాకు చాలా ఆకలిగా ఉన్నది. కాస్త భోజనం పెడతావా?" అని కాజీ వర్తకుడి భార్యను అడిగాడు.

ఆమె కాజీకి వడ్డన చేసి అవతలికి వెళ్ళింది. అప్పుడు కాజీ తన వద్ద నున్న మత్తుమందు తీసి ఆహారంలో కలిపి వర్తకుడి భార్యను పిలిచి, "అమ్మాయీ, నన్ను ఒంటరిగా తినమన్నావా? ఏకాంత భోజనం మహాదోషం. నాకు ఆ దోషం కలగకుండా, నాతో బాటు లాంఛనగా నువు కూడా ఒక ముద్ద తిను మరి," అన్నాడు.

పెద్దవాడి మాట తీసెయ్యటం మర్యాద కాదని వర్తకుడి భార్య, కాజీ అందించిన ముద్దలు రెండు తిని, స్పృహ తప్పి పడి పోయింది.

సరిగా అదే క్షణంలో ఇంటికి ఎవరో వచ్చిన అలికిడి అయింది. తాను చేసిన పాపిష్టి పనికి అసలే దిమ్మరపోయి ఉన్న

కాజీ, మరింత కంగారు పడి, వర్తకుడి భార్యను తీసుకుపోయి, తన ధనమూ, నగలూ దాచి ఉంచే మాళిగలో పెట్టి, ఇవతలికి వచ్చాడు.

ఈ లోపల కాజీ భార్యా, పిల్లలూ ఇంట్లోకి వచ్చారు. కాజీ ఆమెను చూస్తూనే కోపం అభినయిస్తూ, "ఇల్లు గాలికి వదిలేసి ఎక్కడికి వెళ్లావు?" అని అడిగాడు.

"ఇల్లు చూస్తూ ఉండమని వర్తకుడి పెళ్లానికి చెప్పి వెళ్లానే?" అన్నది కాజీ భార్య భయపడుతూ.

"నేను వచ్చి రెండుగంటలయింది. కొంపలో ఎవరూ లేరు. ఎవరినిపడితే వారిని నమ్మవచ్చా? ఏమేం పోయాయో, ఏమిటో?" అన్నాడు కాజీ. కాజీ భార్యా, పిల్లలూ ఆశ్చర్యపోయారు. వర్తకుడి భార్య ఎంత మంచిదో వారికి పూర్తిగా తెలుసు.

వీళ్ళు ఇలా మాట్లాడుకుంటూ ఉండగానే వర్తకుడు కూడా వచ్చాడు. హిందూ దేశం నుంచి అతను ఆ రోజే తిరిగి వచ్చాడు.

"నా భార్యను తీసుకుపోవటానికి వచ్చాను," అన్నాడు వర్తకుడు కాజీతో.

"నీ భార్య చెప్పాపెట్టకుండా ఎటో వెళ్లిపోయింది," అన్నాడు కాజీ.

"కాజీగారు-హాస్యమాడుతున్నారు. నా భార్యను పిలవండి," అన్నాడు వర్తకుడు.






"హాస్య మేమీ లేదు. నిజమే చెబు తున్నాను," అన్నాడు కాజీ.

"నా భార్య అలాటి పని ఎన్నడూ చెయ్యదు. ఇందులో ఏదో మోసం ఉన్నది," అన్నాడు వర్తకుడు.

కాజీ కోపం అభినయిస్తూ, "మతిమాలిన వాడా, అన్యాయం జరిగినది నాకు! అకార ణంగా నన్ను నిందించక, నీ భార్య ఏమ యిందో, ఏ దేశాలు పట్టిపోయిందో వెతుక్కో!" అన్నాడు.

వర్తకుడు తిన్నగా సుల్తాను వద్దకు వెళ్లి, జరిగినది ఆయనకు చెప్పి, కాజీ మీద ఫిర్యాదు తెచ్చాడు.

సుల్తాను ఖాజీని పిలిపించి, జరిగిన దేమిటో అతన్ని చెప్పమన్నాడు.

మూడు నెలల క్రితమే వర్తకుడి భార్య తన ఇంటి నుంచి చెప్పకుండా వెళ్ళిపోయిం దనీ, ఎంత ప్రయత్నించినా ఆమె ఆచూకీ ఎక్కడా దొరకలేదనీ కాజీ సుల్తానుకు విన్న వించుకున్నాడు.

"నా భార్య అలా ఎన్నటికీ చెయ్యదు. కాజీ చెప్పేది అబద్ధం," అన్నాడు వర్తకుడు.

సాక్షులుంటే పట్టుకురమ్మని సుల్తాను కాజీని ఆదేశించాడు. కాజీ వెళ్ళి, తన ఇరుగు పొరుగున ఉన్న పనికిమాలిన వాళ్ళకు లంచం పెట్టి, సాక్షులుగా తెచ్చాడు. వాళ్ళంతా కాజీ చెప్పమన్నట్టే సాక్ష్యం చెప్పారు. సుల్తాను వర్తకుడి ఫిర్యాదును తోసి పుచ్చాడు. వర్తకుడు హతాశుడైపోయాడు.

సుల్తాను మహమ్మదు కొక అలవాటుం డేది. ఆయన సామాన్య పౌరుడి దుస్తులు ధరించి, వీధుల వెంట తిరుగుతూ ప్రజలు అనుకునేది వినేవాడు. అలాగే ఆయన ఆ రాత్రి నగరం పర్యటించసాగాడు. ఆయన ఒక దుకాణం దగ్గిరికి వచ్చేసరికి అక్కడ కొందరు కుర్రవాళ్ళు ఆడుకుంటున్నారు. వాళ్ళు ఒకణ్ణి రాజు చేసి, "ఒరే నువు సుల్తాన్ మహమ్మద్ లాగా తీర్పులు చెప్పా

వంటే నిన్ను పదవి నుంచి దించెయ్యగలం, జాగ్రత్త!" అన్నారు.

సుల్తాను ఈ మాట విని నిర్ఘాంతపోయి, ఆ మాట అన్న కుర్రవాడితో, "సుల్తాన్ మహమ్మద్ తీర్పులు సరిగా ఉండవా ఏం?" అన్నాడు.

"ఇవాళ సుల్తాన్ ఇచ్చిన తీర్పు ఏమిటి? కాజీ తెచ్చిన సాక్షులు ఎటువంటివాళ్ళు? బుద్ధిగలవా డెవడన్నా వాళ్ళ సాక్ష్యం నమ్మ తాడా?" అన్నాడు కుర్రవాడు.

మర్నాడు ఉదయం ఆయన ఆ కుర్ర వాణ్ణి తన ఇంటికి పిలిపించి, "ఇవాళ తీర్పులు చెబుదువుగాని!" అన్నాడు.

కుర్రవాణ్ణి న్యాయపీఠం మీద కూర్చో బెట్టారు. కిందటిరోజు కాజీ పక్షాన సాక్ష్యం చెప్పిన వారిని ఒక్కొక్కరినే పిలిచి ఆ కుర్రవాడు, "నువు వర్తకుడి భార్యను చూశావా? ఆమె వయసెంత? మనిషి ఎలా ఉంటుంది?" అని ప్రశ్నించాడు.

సాక్షులు వర్తకుడి భార్యను చూశా మన్నారే గాని, ఆమె వయసూ, వర్ణనా ఒకరు చెప్పినట్టు ఒకరు చెప్పలేదు.

"మీరు నిజం చెబుతారా? కొరత వేయించాలా?" అని కుర్రవాడు సాక్షులను అడిగాడు.

వెంటనే వాళ్ళంతా కుర్రవాడి కాళ్ళ మీద పడి, తమకు ఏమీ తెలియదనీ, కాజీ చెప్పమన్నట్టు సాక్ష్యం చెప్పామనీ ఒప్పుకున్నారు.

ఆ తరవాత కాజీ నిజం చెప్పక తప్ప లేదు వర్తకుడి భార్యను రహస్య మాళిగ నుంచి రక్షించి, వర్తకుడి కిప్పించారు. సుల్తాను కాజీకి దేశబహిష్కరణ విధించి, అతని ఆస్తిని వర్తకుడి భార్య పరం చేశాడు. తాను చెయ్యలేకపోయిన న్యాయం చేసిన కుర్రవాణ్ణి సుల్తాను తన ఇంటనే ఉంచు కుని, బాగా చదివించి, కాలక్రమాన తన ముఖ్య సలహాదారుగా వేసుకున్నాడు.



# లంచగొండులకు శిక్ష

పూర్వం ఒక రాజ్యంలో లంచగొండి తనాలు జాస్తి అయాయి. రాజుగారు ఎన్ని హెచ్చరికలు చేసినా లాభం లేకపోయింది. అందుచేత దొరికిన లంచగొండ్లను రాజుగారు ముక్కులు కోయించ నారంభించాడు. ముక్కులు కోసే పనికి ఒక మంగలి నియమించబడ్డాడు.

ఒకరోజు రాజుగారు రాజభవనం మీది నుంచి కిందికి చూస్తే మంగలి, శిక్షపడిన లంచగొండితో ఏదో మంతనా లాడుతూండటం కనబడింది. రాజు ఇద్దరినీ పైకి పిలిపించి, "ఏమిటి మీరు మాట్లాడేది?" అని అడిగాడు.

లంచగొండి రాజుతో, "మహారాజా, ఈ మంగలిమంత్రి దగ్గర రెండు కత్తులున్నాయట—ఒకటి పదునైనదీ, ఇంకోటి మొండిదీనూ. రెండు రూకలిచ్చుకుంటే పదునైన కత్తితో చప్పున ముక్కు కోసేస్తాననీ లేకపోతే మొండికత్తితో చాలాసేపు కోస్తాననీ ఇతను అంటున్నాడు," అన్నాడు.

—ఎం. రాజేశ్వరరావు







# పనిపిల్ల

ఒకానొక దేశంలో ఒక ధనికుడుండేవాడు. అతనికీ, అతని భార్యకూ సంతానం లేదు. లేదని వాళ్ళు ఎన్నడూ విచారించను కూడా లేదు. ఎందుకంటే, వారికి మనుషులంటేనే అసహ్యం. ఆఖరుకు ఇంటి ఎదటికి ఒక బిచ్చగాడు వచ్చినా నానా తిట్లూ తిట్టేవాళ్ళు; తిట్లతో పని జరగకపోతే కొట్టి తరిమేసే వాళ్ళు. వాళ్ళలో దయాధర్మం ఏ కోశానా లేదు.

ఈ దంపతులు తమ ఇంటిపని అంతా చెయ్యటానికి దూరప్రాంతం నుంచి ఒక పిల్లను కొనుక్కొచ్చారు. ఆ పిల్ల చేత వాళ్ళు ఇంటిపని అంతా చేయించి, క్షణం విశ్రాంతి తీసుకునేటందుకు లేకుండా చేసేవారు. ఇంటావిడ మహా కర్కోటకురాలు. పనిపిల్ల ఊరికే ఉండకుండా ఏవేవో పనులు కల్పిస్తూ ఉండేది. ఒంటరిగా ఉన్నప్పుడల్లా ఆ పిల్ల తన దుస్థితి తలుచుకుని ఏడుస్తూ ఉండేది.

ఆమె అందమైన పిల్ల అయితే ఎవరో ఒకరు ఆమెను కొనుక్కుని పెళ్ళాడి ఉందురు, కాని ఆ పిల్ల అందగత్తె కాదు. అందుచేత ఆమె బతికున్నంత కాలమూ ధనికుడి ఇంట నరకయాతన అనుభవించక తప్పనట్టు కనబడింది.

ఒకనాడు ఆమె పొయి కింద ఎండుగడ్డి మండిస్తూ ఉన్నది. ఆ ప్రాంతాలవాళ్ళు ఎండుగడ్డినే వంట చెరుకుగా వాడేవారు. ఎండుగడ్డిలో అప్పుడప్పుడూ వడ్లగింజలు దొరుకుతాయి. పనిపిల్ల గడ్డిని పొయిలో పెట్టేముందు అలాటి గింజలను తీసి జాగ్రత్త పరుస్తూ ఉండేది. ఆ విధంగా ఆమె ఒక సోలెడు వడ్లు పోగుచేసి దాచుకుని ఉన్నది.

ఈ రోజు ఆమె పొయి కింద ఎండు గడ్డి మంట చేస్తూండగా తలవాకిలి దగ్గిరికి ఒక వృద్ధుడు వచ్చి, "ఆకలి మండి పోతున్నది, బిచ్చం పెట్టు, తల్లీ!" అని కేకపెట్టాడు.

టి. మాధవరావు

పనిపిల్లకు ఆకలంటే ఏమిటో బాగా తెలుసును. అందుచేత ఆమెకు బిచ్చగాడి మీద జాలి పుట్టుకొచ్చింది. యజమానీ, యజమానురాలూ ఇంట్లో లేరు. అయినా ఇంట్లో వస్తువులు పైవాళ్ళ కిస్తే వాళ్ళు తెలుసుకోగలరు. ఇంటావిడకు ప్రతిదీ గుర్తే. అందుచేత పనిపిల్ల తాను రహస్యంగా పోగు చేసిన వడ్లు తెచ్చి, వృద్ధుడి జోలెలో పోసి, "ఇల్లుగలవాళ్ళు వస్తారు, నువు త్వరగా వెళ్ళి పో, తాతా! వాళ్ళ నోళ్ళూ, చేతులూ కూడా మహా చెడ్డవి," అన్నది.

వృద్ధుడు పనిపిల్లకు ఒక మురికి గుడ్డ ముక్క ఇచ్చి, "ఎప్పుడు మొహం కడుక్కున్నా ఈ గుడ్డతోనే తుడుచుకో, తల్లీ. నీకు మేలు కలుగుతుంది," అన్నాడు.

ఆ ముసలివాడు కృతజ్ఞతాపూర్వకంగా ఇచ్చాడుగదా అని ఆ పిల్ల ఆ మురికి గుడ్డను తీసుకున్నది.

అదే సమయంలో ఇంటివాళ్లు వచ్చారు; "వీడెవడు? వీడికేమన్నా ఇచ్చావా? వీడితో ఏమిటి మాట్లాడుతున్నావు?' అని అడిగారు.

"నేనేమీ ఇంటి వస్తువు లివ్వలేదు. కావలిస్తే చూసుకోండి," అన్నది పనిపిల్ల.

"ఇస్తే నా సంగతి తెలీదూ?" అన్నది ఇంటావిడ. కాని ఆమె వాణ్ణి తణిఖీ చేసే లోపల వాడు కాస్తా ఎటో అదృశ్యమయాడు.



ఇంటివాళ్ళు, ముసలివాడు తప్పించుకు పోయాడన్న కోపాన్ని పనిపిల్ల పైన చూపి, ఆమెను చావచితక తన్నారు.

అటు తరవాత పనిపిల్ల స్నానం చేసి నప్పుడల్లా తన శరీరాన్ని వృద్ధు డిచ్చిన గుడ్డ ముక్కతో తుడుచుకునేది. అందులో ఏదో ప్రభావం ఉండి ఉండాలి. ఏమంటే, ఆ పిల్ల శరీరం నానాటికీ నలుపు విరిగి, పచ్చబడసాగింది. రంగుతోబాటు ఆమె ముఖానికి అందం కూడా రాసాగింది.

అనాకారిగా ఉండే తమ బానిసపిల్ల నానాటికీ అందంగా తయారవుతూండటం ఇంటివాళ్లు త్వరలోనే తెలుసుకున్నారు. ఈ మార్పుకు ఏదో రహస్య కారణం ఉండా లని వారికి అనిపించింది. ఆ పిల్లను అడిగితే ఆమె చెప్పలేదు. చివరకు వాళ్ళామెను విపరీతంగా హింసించి, వృద్ధు డిచ్చిన గుడ్డ ముక్క రహస్యాన్ని బయట పెట్టించారు. మరుక్షణమే వాళ్ళు ఆమె వద్ద నుంచి ఆ గుడ్డ ముక్కను లాగేసుకుని, తమ ముఖాలు కడుక్కుని, దానితో తుడుచు కున్నారు. తమ ముఖాలు అందంగా తయా రయాక, ఆ తుండుగుడ్డను ఇతరులకు అద్దె కిచ్చి, బోలెడంత డబ్బు చేసుకుందా మని వాళ్ళ ఆశ.

కాని వాళ్ళు తమ ముఖాలను అద్దంలో చూసుకుంటే అవి కోతి ముఖాలుగా తయా రయాయి! దానికి తగ్గట్టుగా వాళ్ళ శరీరాల మీద రోమాలూ, పెద్ద పెద్ద తోకలూ పెరుగు కొచ్చాయి.

వాళ్ళిద్దరూ అవమానంతో కుంగిపోయి, ఊరి అవతల ఉండే అరణ్యానికి పారి పోయారు. వారి సంపదకు పనిపిల్లే అధి కారిణి అయింది. ఇప్పుడామె చక్కనిది కూడా గనక ఊళ్లో ఉండే ఒక సంపన్న యువకుడు ఆమెను పెళ్ళాడటానికి ముందుకు వచ్చాడు. ఆ పిల్ల అతన్నే పెళ్ళాడి సుఖంగా జీవితం గడిపింది.



# ఆస్తిపంపకం

ఒక వర్తకుడికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడు స్వార్థపరుడు, చిన్నవాడు అమాయకుడు. తన అనంతరం చిన్నవాణ్ణి పెద్దవాడు మోసం చెయ్యవచ్చునని వర్తకుడు తన కున్నదంతా రెండు మూటలలో పెట్టి, తాను చచ్చిపోబోతూ కొడుకులను పిలిచి, "అబ్బాయిలూ, నాకున్నది యావత్తూ రెండు మూటలలో పెట్టి పడమటి గదిలో ఉంచాను. చెరొక మూటా తీసుకుని ఎవరి బతుకు వారు బతకండి," అన్నాడు.

వర్తకుడు పోయాడు. దినవారాలు రేపు పూర్తి అవుతాయనగా పెద్దవాడు రాత్రివేళ పడమటి గది ప్రవేశించి, రెండు మూటలూ విప్పి చూశాడు. ఒక మూటలో పై భాగంలో వెండి నాణాలున్నాయి; కింది సగంలో మట్టి ఉండ లున్నాయి. రెండో మూటలో పై సగంలో మట్టి ఉండలూ, కింది సగంలో వెండి నాణాలూ ఉన్నాయి. ఇలా ఎందు కున్నాయో పెద్దవాడికి అర్థం కాలేదు. అందుచేత వాడు వెండి నాణాలన్నీ ఒక మూటలో పోసి, రెండో దానిలో మట్టి ఉండలన్నీ పోసి, మర్నాడు తన తమ్ముడితో, "తమ్ముడూ, నాన్న చెరొక మూటా తీసుకోమన్నాడు. ఈ మూట నేను తీసుకుంటాను, అది నువు తీసుకో," అని తాను వెండి నాణాల మూట తీసుకుని, తమ్ముడికి మట్టి ఉండల మూట ఇచ్చాడు.

తరవాత రెండోవాడు మట్టి ఉండలు మూటలో ఎందు కున్నాయా అని ఒక ఉండను పగలగొట్టి చూస్తే అందులో బంగారు నాణెం ఉన్నది. వాడికి వచ్చినది బంగారు నాణాల మూట!

—అజ్జరపు హనుమంతరావు, బి. ఎస్‌సి.






# సిందబాద్ అద్భుతయాత్రలు

నాలుగుసార్లు సముద్రయానాలు చేసి నానా కష్టాలూ పడినా కూడా, సిందబాద్ ప్రతి సారీ అంతులేని ధనం సంపాదించాడు. ఎంతో అనుభవం గడించాడు. ఎంతో కష్టపడి సంపాదించిన అనుభవం కావటంచేత అది అతనికి మరింత విలువైనదిగా తోచింది. అందుచేత, ఇంటి వద్ద కూర్చుని ఎన్ని వైభోగాలు అనుభవించినా అతని బుద్ధి కాలక్రమాన మళ్ళీ విదేశయాత్రల మీదికే మళ్లింది.

అతను అయిదోసారి సముద్రయానానికి సన్నాహం చేశాడు. ఇతర దేశాలలో మంచి లాభానికి అమ్ముడయే సరుకులు కొని, బేళ్లు కట్టించి, అమ్మకానికి వచ్చిన ఒక ఓడను చూసి ముచ్చటపడి, దాన్ని ఏకంగా కొనేసి, దాన్ని నడపటానికి అనుభవంగల సరంగునూ, కళాసులనూ జీతానికి కుదుర్చుకుని, తన ఇంటి బానిసలను వెంట పెట్టుకుని ప్రయాణానికి సిద్ధమయాడు. ఈ సంగతి తెలిసి మరికొందరు వర్తకులు, ప్రయాణపు ఖర్చులు ముందుగానే అతని కిచ్చి, అతని ఓడలో బయలుదేరారు. సిందబాద్ ఈసారి తన సొంత ఓడలో ప్రయాణం కావటమే గాక, సముద్రయానంలో లోగడ చాలా అనుభవం గడించి ఉండటంచేత తాను సరంగుకు సలహా లివ్వదగిన స్థితిలో కూడా ఉన్నాడు.

బస్రా దాటినాక ప్రయాణం చాలా సుఖప్రదంగా సాగింది. గాలి అనుకూలంగా ఉన్నది. సముద్రం ప్రశాంతంగా ఉన్నది. ఓడ ఆగిన ప్రతి రేవులోనూ క్రయవిక్రయాలు సవ్యంగా జరిగాయి.

ఒకసారి ఓడ ఒక నిర్జనమైన దీవి చేరింది. అక్కడ లంగరు దించి, వర్తకులు దీవి చూడబోయారు. వారికి దీవి మీద ఒక గండభేరుండపక్షి గుడ్డు కనిపించింది.





చాపలు ఎత్తించి, ఓడను సముద్రం మీదికి నడిపించాడు.

వర్తకులు తాము తెచ్చుకున్న పక్షి మాంసం వండించుకున్నారు. కాని వాళ్ళు దాన్ని తినేలోపల ఆకాశాన సూర్యుడికి రెండు మేఘాలు అడ్డు తగిలినట్టయింది. అవి గండభేరుండ పక్షులే. వాటి రెక్కల చప్పుడూ, అరుపులూ మేఘగర్జన లాగా వినిపించాయి. అవి సింద్‌బాద్ నౌకకు ఎగువగా ఎగరసాగాయి. వాటి కాళ్ళ గోళ్ళ మధ్య రెండు బ్రహ్మాండమైన కొండరాళ్ళు, నౌక కన్న కూడా పెద్దవి, ఉన్నాయి.

అదేమిటో తెలియక వాళ్ళు దానిపైన రాళ్లు వేశారు. గుడ్డు చిట్లి, లోపల ఉన్న పక్షి పిల్ల కాలు బయటికి వచ్చింది. వర్తకులు ఆ పిల్లను బయటికి లాగి, దాన్ని ముక్కలుగా కోసి పంచుకుని, ఓడకు తిరిగి వచ్చారు.

వాళ్ళు తాము చేసిన పని చెప్పగానే సింద్‌బాద్ చాలా కంగారు పడ్డాడు. "మీరు చాలా ప్రమాదమైన పని చేశారు. గండ భేరుండ దంపతులకు జరిగినది తెలియగానే మనని తరిమి, హతమారుస్తాయి! మనం సాధ్యమైనంత శీఘ్రంగా పారిపోవటం తప్ప చేసేది లేదు," అన్నాడతను వర్తకులతో. అతను ఆ క్షణంలోనే తెర

చూస్తుండగానే ఒక పక్షి తన కాళ్ళ మధ్య ఉన్న రాతిని సూటిగా ఓడ మీదికి వదిలింది. అయితే సరంగు చుక్కాని పక్కకు తిప్పి, ఉపాయంగా ఓడను కాపాడాడు. ఆ రాయి ఓడ పక్కగా సముద్రంలో పడింది. రాయిపాటుకు నీటిలో గొయ్యి ఏర్పడి, క్షణంపాటు అడుగు కనిపించింది. అప్పుడు లేచిన అలలకు ఓడ బెండు ఆడినట్టు ఆడిపోయింది.

ఇంతలో రెండో పక్షి తన కాళ్ళ మధ్య ఉన్న రాతిని విడిచింది. దాని దెబ్బకు ఓడలో ఒక సగం నుగ్గు నుగ్గు అయిపోయింది. కొందరు రాతిపాటుకే చచ్చారు.



మిగిలిన వాళ్ళు సముద్రంపాత పడ్డారు. సింద్‌బాద్ తన ప్రాణం కాపాడుకోవటానికి విశ్వప్రయత్నం చేశాడు. అతనికొక పలక దొరికింది. దాని సహాయంతో తేలుతూ, కాళ్ళను తెడ్లలాగా ఉపయోగిస్తూ ఒక దీవిని ఎలాగో చేరుకోగలిగాడు. అక్కడ ఇసుకలో కొంతసేపు పడుకుని, సేదతీరాక దీవిని పరీక్షించటానికి బయలుదేరాడు.

ఆ దీవి అతనికి భూలోకస్వర్గంలాగా కనబడింది. అంతటా పళ్ళచెట్లూ, వాటి మీద పచ్చగా పండిన పళ్ళూ ఉన్నాయి. చెట్ల మీద రంగురంగుల పక్షులు కలకల నినాదాలు చేస్తున్నాయి. కింద ఉన్న నేల రకరకాల పూలమొక్కలతో రంగుల తివాసీ లాగున్నది. ఆ పూలు సువాసనలు వెద జల్లుతున్నాయి. సింద్‌బాద్ చెట్ల మీది పళ్ళు కోసుకు తిని, నిర్మలమైన సెలయేటి నీరు తాగి, పువ్వుల తివాసీ పైన పడుకుని సాయంకాలం దాకా నిద్రపోయాడు.

అతను నిద్ర లేచేసరికి చీకటిపడబోతు న్నది. అది నిర్జనమైన దీవి కావటంచేత అతనికి చీకటి భయం పుట్టుకొచ్చింది. ఆ రాత్రి ఎలాగో కలతనిద్రపోయాడు గాని, భయంకరమైన కలలు కన్నాడు. ఎలాగో రాత్రి గడిచి తెల్లవారింది. అతను తిరిగి దీవి మీద తిరగటం మొదలుపెట్టాడు.





కొంతసేపయాక అతనికి తలవని తలం పుగా ఒక మనిషి కనిపించాడు. ఒకచోట ఒక మడుగున్నది. అందులోకి ఒక జల ధారపడుతున్నది. మడుగు అంచున ఆ మనిషి కూర్చుని ఉన్నాడు. ఆ మనిషి ముసలివాడు. ఆకులతో దుప్పటిలాటిది తయారుచేసుకుని, దాన్ని తన శరీరం మీద కప్పుకుని ఉన్నాడు. తనలాగే ఆ మనిషి కూడా పగిలిన ఓడలో నుంచి ప్రాణాలతో వచ్చిచేరిన నావికుడై ఉంటాడని సింద్‌బాద్ అనుకున్నాడు.

అతను ఆ ముసలివాణ్ణి సమీపించి, "ఏం, బాబూ? నువ్విక్కడికి ఎలా చేరావు?" అని అడిగాడు. ముసలివాడు విచారంగా తల అడ్డంగా తిప్పి, కొన్ని సంజ్ఞలు చేశాడు. తనకు ప్రవాహం దాటా లని ఉన్నదనీ, దాని అవతలి గట్టున ఉన్న చెట్లపళ్ళు తినాలని ఉన్నదనీ, తనను ప్రవాహం దాటించమనీ ముసలివాడు సంజ్ఞలు చేశాడు.

సింద్‌బాద్ ఆ ముసలివాడికి సహాయం చేద్దామనుకుని, వంగి అతణ్ణి తన భుజాల మీదికి ఎక్కించుకున్నాడు. ముసలివాడు తన తొడలతో సింద్‌బాద్ కంఠాన్ని బలంగా పట్టుకుని, కాళ్ళు మెలికవేసి సింద్‌బాద్ రొమ్ముకు అదిమిపెట్టి, సింద్‌బాద్ తలను తన చేతులతో పట్టుకున్నాడు. సింద్‌బాద్ ప్రవాహం దాటి, కొంచెం వంగి, "బాబూ, నింపాదిగా దిగు," అన్నాడు.

కాని ముసలివాడు దిగే ప్రయత్నం చెయ్యక, తన తొడలతో సింద్‌బాద్ కంఠాన్ని మరింత దృఢంగా నొక్కిపట్టి, అతని భుజాలమీద మరింత బరువుగా కూర్చు న్నాడు. సింద్‌బాద్ ఆ ముసలాడి కాళ్ళ కేసి చూసి కంపరమెత్తిపోయాడు. ఆ కాళ్లు బొచ్చుతో ఎనుబోతు కాళ్ళ లాగున్నాయి. ముసలివాణ్ణి కింద పడెయ్యాలని సింద్‌బాద్ ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం ఫలించక

పోగా ముసలాడు సింద్‌బాద్ కంఠాన్ని మరింత గట్టిగా నొక్కి, ఊపిరాడకుండా చేశాడు. సింద్‌బాద్ కళ్ళు చీకటి అయి పోయాయి. అతను స్పృహ తప్పి కింద పడిపోయాడు.

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి ముసలాడింకా అతని భుజాల మీదే ఉన్నాడు. అయితే ఇప్పుడతనికి ఊపిరి ఆడుతున్నది.

సింద్‌బాద్‌కు స్పృహ వచ్చినట్టు తెలిసి ముసలాడు కాళ్ళతో అతని గుండెల్లో తన్నాడు. సింద్‌బాద్ లేచి నిలబడి, ముసలాడికి కావలిసినట్టుగా నడవసాగాడు. వాడు ఆగమంటే ఆగాలి, నడవమంటే నడవాలి. వాడికి కావలిసినట్టు చెయ్యకపోతే కాలి తన్నులు తినాలి. అలా వచ్చింది సింద్‌బాద్ గతి. అతను రాత్రి పూట నిద్రపోయినప్పుడు కూడా ముసలాడు అతని భుజాల మీది నుంచి దిగలేదు.

ముసలాడి వల్ల కలిగిన శరీరబాధా, అవమానమూ సింద్‌బాద్ తన జీవితంలో లోగడ ఎన్నడూ ఎరగడు.

అతను ముసలాణ్ణి చాలా వారాలపాటు మోశాడు. తరవాత ఒకనాడు అతనికి ఒక చోట పెద్ద పెద్ద సొరకాయ లున్న లత కనబడింది. అందులో ఎండ బారుతున్న సొర





కాయగా చూసి కోసి, దాన్ని డొల్ల చేసి, అందులో ద్రాక్షపళ్ళ రసం నింపి, బిరడా బిగించి, ఎండ పడే చోట పెట్టాడు. కొన్ని రోజుల అనంతరం ద్రాక్షరసం పులిసి సారా అయింది. తరవాత అవకాశం దొరికినప్పుడల్లా ఆ సొరకాయ బుర్రలో ఉన్న సారాను అతను కొంచెం కొంచెం తాగుతూ వచ్చాడు. దానితో అతనికి బలమూ, ఉత్సాహమూ పెరిగాయి. తనను ఇంతకాలంగా మోస్తున్న మనిషి అకస్మాత్తుగా, గెంతటమూ, పాడటమూ, నృత్యం చెయ్యటమూ ముసలాడు గమనించి, సొరబుర్రను తనకు కూడా ఇయ్యమని సంజ్ఞ చేశాడు. వాడంటే భయం



కొద్దీ సింద్‌బాద్ వాడికి సారా ఇచ్చాడు. ముసలాడు ముందు కొంచెం రుచి చూసి, వెంటనే బుర్ర అంతా ఖాళీ చేసి ఖాళీ బుర్రను దూరంగా గిరవాటు వేశాడు. కొద్ది సేపటికల్లా వాడి నిషా మైకంగా మారింది.

ముసలాడి కాళ్ళ పట్టు మెడమీద సడలటం గమనించి, సింద్‌బాద్ వాడి కాళ్లు మెలిక విప్పి, ఒక్క తోపుతో వాణ్ణి కింద పడేశాడు. ముసలాడు పడిన చోటనే ఉండిపోయాడు. సింద్‌బాద్ పెద్ద రాయి ఏరుకొచ్చి, ముసలాడి తల చితకగొట్టి, వాణ్ణి చంపేశాడు.

ఈ విధంగా ముసలాడి పీడ వదిలించుకుని, సింద్‌బాద్ సముద్ర తీరానికి పరిగెత్తాడు. అతని కోసం వచ్చినట్టుగా తీరాన లంగరు దించిన ఒక ఓడా, కొందరు నావికులూ ఉన్నారు. వారు నీటి కోసమూ, పళ్ళ కోసమూ ఆ దీవి చేరారట.

సింద్‌బాద్ ముసలాణ్ణి గురించి చెబితే వాళ్ళు ఆశ్చర్యపోయి, "ఆ ముసలాడి నుంచి తప్పించుకున్నావా? అలా తప్పించుకున్నవాడివి నువ్వొక్కడివే అయి వుంటావు. వాడు ఎందరినో చంపాడు," అన్నారు.

వాళ్లు సింద్‌బాద్‌ను తమ ఓడలోకి ఎక్కించుకున్నారు. అతనికి వాళ్లు బట్టలు





కూడా ఇచ్చారు. ఓడ అక్కడి నుంచి బయలుదేరి చాలా రోజుల అనంతరం ఒక నగరంలో రేవు చేరింది. అది చాలా పెద్ద నగరంట. నగరం చుట్టూ ఉండే చెట్లమీద కొండముచ్చులు అసంఖ్యాకంగా ఉండటం చేత ఆ నగరానికి కొండముచ్చుల నగరం అని పేరు వచ్చిందనీ, ఆ నగరానికి దేశ దేశాల వర్తకులు వస్తూంటారనీ సింద్‌బాద్ తెలుసుకున్నాడు.

సింద్‌బాద్ ఒక వర్తకుడితో స్నేహం కలిపి, ఆ వర్తకుడి వెంట నగరంలోకి బయలుదేరాడు. ఆ వర్తకుడు ఒక సంచీ నిండా గులకరాళ్ళు పోసి సింద్‌బాద్‌కిచ్చి, "చాలామంది నగరద్వారం దాటి సమీపంలో ఉండే లోయకు పోతూ నీకు కనిపిస్తారు. నువు వారితో వెళ్లి, వాళ్ళేం చేస్తే నువూ అదే చెయ్యి. అందువల్ల నీకు లాభిస్తుంది," అని చెప్పాడు.

సింద్‌బాద్ గులకరాళ్ళ సంచీ తీసుకుని నగరద్వారం వద్దకు వెళ్ళి, మందలు మందలుగా బయటికి వచ్చే జనాన్ని చూసి, వారివెంట నడిచాడు. కొంతదూరం నడవగా ఒక లోతైన లోయ వచ్చింది. అందులో చాలా ఎత్తయిన చెట్లున్నాయి. మనుష్యమాత్రుడెవడూ వాటిని ఎక్క సాహసించడు.



అవి కొబ్బరిచెట్లని సింద్‌బాద్ తెలుసుకున్నాడు. వాటి మీద కొబ్బరికాయలూ, కొండముచ్చులూ పుష్కలంగా ఉన్నాయి.

అందరూ చెటకిందికి చేరి, తమ సంచులలో ఉన్న గులకరాళ్ళతో కొండముచ్చులను కొట్టసాగారు. కొండముచ్చులు కొబ్బరికాయలు కోసి, కింద ఉన్నవాళ్ళమీద విసిరాయి. అందరూ కొబ్బరికాయలు ఏరుకుని, సంచులలో వేసుకున్నారు, సంచులు నిండగానే వాళ్లు వాటిని భుజాల కెత్తుకుని నగరంలోకి వెళ్ళారు.

సింద్‌బాద్ తెచ్చిన కొబ్బరికాయలను అతని స్నేహితుడైన వర్తకుడు తీసుకుని,



వాటి ధర సింద్‌బాదు కిచ్చేశాడు. సింద్‌బాద్ ఇలా రోజూ లోయకు వెళ్ళి, కొబ్బరి కాయలు తెచ్చి, తన మిత్రుడికి అమ్మి, ఆ వచ్చిన డబ్బుతో వ్యాపారం చేసి, ముత్యాలదీవికి వెళ్ళటానికి ఓడ కేవుకు సరిపడినంత డబ్బు పోగుచేశాడు.

అతను ముత్యాలదీవికి వెళ్ళేటప్పుడు చాలా కొబ్బరికాయలు తన వెంట తీసుకు పోయాడు. అక్కడక్కడా తగిలిన రేవులలో కొబ్బరికాయలు అమ్మి, మిరియాలూ, లవంగపట్టా కొని, మరికొన్ని దీవులలో ఆ సరుకు మంచి లాభానికి అమ్మాడు. ఈ డబ్బు ముత్యపుచిప్పలు ఏరేవాళ్ళకు కూలి ఇవ్వటానికి పనికి వచ్చింది.

ముత్యపుచిప్పలలో మంచి ముత్యాలు దొరకటం కేవలం అదృష్టం. సింద్‌బాద్‌కు అదృష్టం కలిసివచ్చి, అతను సంపాదించిన ముత్యపుచిప్పలలో మంచి ముత్యాలు దొరికాయి. వాటిని అక్కడి వర్తకులకు అమ్మగా మంచి ధర వచ్చింది. త్వరలోనే అతను చాలా డబ్బు పోగు చేసుకున్నాడు. అతనికి ఇంటి పైన ధ్యాస మళ్ళింది. తిరుగు ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేసుకుని, దారిలో తగిలే రేవుల్లో అమ్మటానికి ముసాంబరంచెక్క పుష్కలంగా కొని ఓడ కెక్కించాడు. ఈ ముసాంబరం చెక్క ఆ దీవులలో ఎక్కడబడితే అక్కడ దొరుకుతుంది.

ఆ సరుకంతా దారివెంట విక్రయిస్తూ సింద్‌బాద్ బస్రా మీదుగా బాగ్దాద్‌నగరం చేరుకున్నాడు.

అతను క్షేమంగా తిరిగి వచ్చినందుకు అతని బంధుమిత్రు లందరూ ఎంతో సంతోషించారు. సముద్రయానం లాభసాటిగా ముగియటంచేత అతను పేదసాదలకు దాన ధర్మాలు చేసి, మళ్ళీ యథాప్రకారం భోగ భాగ్యాలతో తులతూగుతూ, సుఖజీవనం గడపసాగాడు.






# మూడు రాగి డబ్బులు

ఒక నగరంలో చాంగ్ అనే పొగాకు అమ్ముకునే వాడుండేవాడు. కావడిబద్దకు రెండు చివరలా వెదురు తట్టలు కట్టి, వాటిలో పొగాకు పెట్టుకుని, వీధుల వెంట కేకలు పెడుతూ తిరిగి అమ్ముకునేవాడు. జన సమ్మర్దమైన వీధుల కుండా తిరుగుతూ చాంగ్ చాలా శ్రమపడి తన వృత్తి సాగించుకోవలిసి వచ్చేది. అతను అమ్మే సరుకు సందులలోనూ, గొందులలోనూ అమ్ముడయేది కాదాయె.

ఒకనాటి ఉదయం చాంగ్ కావడి భుజాన వేసుకుని, జనాన్ని తోసుకుంటూ పోతూ ఉండగా, చింకి దుస్తులు ధరించి ఉన్న ఒక వృద్ధుడు అతన్ని భుజం తట్టి ఆపి, "బాబూ, నా చిలుము నిండా పొగాకు నించుతావా?" అని అడిగాడు.

చాంగ్ అటూ ఇటూ చూశాడు. కావడి దించటానికి అవకాశం కనిపించ లేదు. ముసలివాడు మూడు రాగి డబ్బులు చూపాడు. నిజానికి చిలుము నిండే పొగాకుకు అది పెద్ద ధరే.

"ఈ రద్దీలో కావడి దించటం నా వల్ల కాదు. నీ చిలుము నువే నింపుకో, తాతా," అన్నాడు చాంగ్.

ముసలివాడు తన బొటనవేలూ, చూపుడు వేలూ ఉపయోగించి మూడుపట్లు తీసి చిలుములో జాగ్రత్తగా కూరాడు. ఆ కాస్త చిలుములో అంత పొగాకు పట్టినందుకు చాంగ్ ఆశ్చర్యపోయాడు. అయితే చిలుము ఇంకా నిండనే లేదు. వృద్ధుడు తట్టలో ఉన్న పొగాకంతా ఆ చిలుములోకి ఎలాగో పట్టించాడు.

చాంగ్ నోటమాట లేక, మోసం జరిగినందుకు బాధ పడుతూ, ఖాళీ అయిపోతున్న పొగాకు తట్టనూ, వృద్ధుణ్ణి చూస్తూ రాయిలా ఉండిపోయాడు.

చీనా జానపద కథ

వృద్ధుడు చాంగ్ దగ్గిరవున్న పాగాకంతా ఖాళీ చేసేసి, మూడు రాగి డబ్బులూ చాంగ్ తట్టలో పెట్టి, చిలుము అంటించుకుని, జనంలో కలిసిపోయాడు. హతాశుడైన చాంగ్ చిరాకు పడుతూ ఇంటికి బయలుదేరాడు.

దారిలో అతనికి కావడి బరువెక్కుతున్నట్టనిపించింది. "గిట్టుబాటు కాని బేరం బరువు చేటంటారు," అనుకున్నాడు చాంగ్. కాని నిజంగానే వెనక ఉన్న తట్ట క్రమక్రమంగా చాలా బరువెక్కి, చాంగ్ తన కావడిని వీధికి ఒక పక్కగా దింపుకోవలిసి వచ్చింది.

కావడి దింపి చూసేసరికి వెనక తట్ట నిండా రాగి డబ్బు లున్నాయి. చాంగ్ చూస్తుండగానే వాటి సంఖ్య పెరుగుతున్నది! అతను చప్పున ఆ తట్టను రెండు చేతులా పట్టుకుని, కావడితో సహా సాధ్యమైనంత త్వరలో ఇంటికి వచ్చిపడ్డాడు.

అతను గడప తగిలి కిందపడేసరికి రాగి డబ్బులన్నీ చిందరవందరగా నేల మీద పడ్డాయి. సరిగా ఊపిరి కూడా ఆడని స్థితిలో అతను వాటి నన్నిటినీ పోగు చేసి తన కొయ్యపెట్టెలో పోసి, మూత వేసేశాడు.

తరవాత అతను ఇంటి బయటికి వచ్చి తాపీగా గాలి పీల్చుకుంటూ, జరిగినదాన్ని



అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాడు. కొద్ది సేపట్లోనే లోపలి నుంచి కంగ్, కంగ్ అని మోత వినిపించింది. అతను లోపలికి వెళ్ళి చూసేసరికి డబ్బు పెట్టె మూత పైకి లేచి ఉన్నది. దానినుంచి రాగి డబ్బులు కింద పడుతున్నాయి. వాటి సంఖ్య ఇంకా పెరుగుతూనే ఉన్నది!

చాంగ్ ముక్కు గోక్కుని ఆలోచనలో పడ్డాడు. చివరకతను ఒక వడ్ల గాదె తెచ్చి, రాగి డబ్బులు అందులో పోశాడు. ఆ గాదె నిండింది. సాయంకాలం లోపల మూడు గాదెలు నిండాయి. ఆ రోజు చాంగ్‌కు చేతి నిండా పని.

చాంగ్ పూర్తిగా సంతుష్టి చెందాడు. తాను ఇప్పుడు ధనికుడు. వీధుల వెంట తిరిగి పొగాకు అమ్ముకోనవసరం లేదు. అతను తనఖా వ్యాపారం చేయ నిశ్చయించాడు. దర్జాగా దుకాణంలో కూర్చుని తాకట్ల మీద జనానికి అప్పులివ్వటం తప్ప తాను ఇంకే విధమైన శరీరకష్టం చేయ నవసరం లేదు!

అతను తనఖా వ్యాపారం ప్రారంభించాడు. అది బాగా కలిసి వచ్చింది. కాని చిత్ర మేమిటంటే అతని ఖజానా పెట్టెలో రాగి డబ్బు లింకా పెరుగుతూనే ఉన్నాయి. అందులో నుంచి ఎంత డబ్బు తీసినా తరుగు కనిపించటం లేదు.

ఇలా ఉండగా ఒకనాడు అతని దుకాణానికి ఎవరో ముసలివాడు వచ్చి కొన్ని వస్తువులు అమ్మ జూపాడు. అవి ఏమంత విలువగలవి కావు. చాంగ్ వాటిని అటూ ఇటూ తిప్పి చూసి, "వీటికి ఏమియ్యమంటావు?" అని అడిగాడు.

ముసలివాడు తడుముకోకుండా, "మూడు రాగి డబ్బు లియ్యి," అన్నాడు. చాంగ్ ముసలివాడికి మూడు రాగి డబ్బులూ ఇచ్చేశాడు. ఆటు పిమ్మట చాంగ్ పెట్టెలో రాగి పెరగటం మానేసింది.





# వివేకి

ఒక గ్రామంలో ఒక రైతుకు సారంగుడనే కుమారు డుండేవాడు. వాడు చాలా బుద్ధి మంతుడు. వాణ్ణి చూసి వాడికి చదువు చెప్పిన అయ్యవారూ, ఊళ్ళో వాళ్ళూ, అందరికన్నా వాడి తల్లి దండ్రులూ ఎంతో గర్వపడేవాళ్ళు వాడు ఇంకా పెద్ద చదువులు చదివితే ఎంత పైకి అయినా వస్తాడని అందరూ అనేసరికి, వాడి తండ్రి ఒక ఆవును అమ్మి ఆ డబ్బుతో సారంగుణ్ణి దూరాన ఉన్న విద్యాకేంద్రానికి పంపాడు.

అక్కడ ఒక ఏడాది ఉండి సారంగుడు ఇంటికి తిరిగి వచ్చేసరికి వాడి తల్లి, "చదువు జాస్తి అయింది గామాలు, నా తండ్రి పాలి పోయి వచ్చాడు," అన్నది.

"ఏమిట్రా నువు చదువు కొచ్చినదీ?" అని తండ్రి అడిగాడు.

"నా కిప్పుడు కప్పల భాష అర్థమవు తుంది, నాన్నా," అన్నాడు సారంగుడు.

"కప్పల భాషా? నిక్షేపమంటి ఆవును తెగనమ్మి నిన్ను చదువుకోమని పంపిస్తే నువు చేసుకొచ్చిన నిర్వాహకం ఇదా? చదువు చాల్లే. ఇంటి పట్టున ఉండి, పొలం పనులు చూడు!" అన్నాడు తండ్రి.

సారంగుడు తండ్రికి పొలం పనులలో తోడ్పడుతూ కొంతకాలం గడిపాడు. అతని ఆరోగ్యం బాగుపడింది. ఒకనాడు అతను తండ్రితో, మళ్ళీ వెళ్ళి చదువుకుంటా నన్నాడు. ఎంత మాత్రమూ వీల్లేదన్నాడు తండ్రి. కాని సారంగుడి తల్లి తన భర్తతో పోట్లాడింది; "ఇన్నాళ్లూ చదివి, అందరి చేతా తెలివిగల వాడనిపించుకుని, గొడ్డు చాకిరీ చేస్తూ ఇక్కడే పడి ఉంటాడా నా కొడుకు? వాడు చదువుతా నంటే చదివించి తీరాలిసిందే!" అన్నది.

భార్య మాట తీసెయ్యలేక రైతు తన కొడుక్కు డబ్బిచ్చి మళ్ళీ చదువుకు పంపే

ఆర్. వెంకటేశ్వరరావు

శాడు. విద్యాకేంద్రంలో కొంతకాలం చదువుకుని సారంగుడు ఆరోగ్యం పోగొట్టుకుని తిరిగి వచ్చాడు

"ఈసారైనా మంచి చదువు అబ్బిందా?" అని తండ్రి సారంగుణ్ణి అడిగాడు.

"అబ్బింది, నాన్నా. నాకిప్పుడు కుక్కల భాష అర్థమవుతుంది," అన్నాడు సారంగుడు.

"కుక్కల భాషా, కప్పల భాషా ఎవడికా్కవాలిరా? అవేమన్నా కూడూ గుడ్డా పెడతాయా? చదివింది చాల్లే. ఇంక చదువుతా ననకు," అన్నాడు తండ్రి.

కాని సారంగుడు కొంతకాలం తండ్రితో బాటు పొలం పనులు చేసి, ఇంకా చదువుకోవాలని ఉందన్నాడు. సారంగుడు సాయపడినందు వల్ల పంటల మీద మంచి రాబడి వచ్చింది. ఏ బుద్ధిన ఉన్నాడో గాని తండ్రి అతనికి అడిగిన డబ్బిచ్చి చదువుకు పంపేశాడు.

సారంగుడు తిరిగి వచ్చినాక అతని తండ్రి, "ఈసారయినా మంచి పండితుడివైనావా?" అని అడిగాడు.

"అవును, నాన్నా. నా కిప్పుడు చేపల భాష కూడా వచ్చేసింది," అన్నాడు సారంగుడు.



"ఇక ఈ చదువులు కట్టి పెట్టెయ్యి. వల్లమాలిన డబ్బుండి పనీ పాటా లేనివాళ్లు చదివే ఈ చదువులు మనకు అచ్చిరావు. ఇక్కడే వుండి రైతువుగా బతకటం నేర్చుకో, అంతే చాలు," అన్నాడు తండ్రి.

సారంగుడిక చదువు మాట ఎత్తక, పొలం పనులే చూసుకోసాగాడు. అతను ఒకనాడు తన పొలంలో ఓదెలు కట్టుతూండగా ఇద్దరు పెద్ద మనుషులు డొంక వెంబడి నడుస్తూ ఆగి, "అబ్బాయీ, మేము రామపురం పోతున్నాం. రాజావారు మంత్రిని నియమిస్తారట. మేమూ పని దొరుకుతుందేమోనని పోతున్నాం. మాకు దారి బాగా తెలి



యుదు. అక్కడి వరకూ తోడుగా వస్తావా ఏమిటి?'' అని అడిగారు.

వాళ్ళు తమవెంట నౌకరులాటి వాడికోసం చూస్తున్నారు. వాళ్ళకు సారంగుడు ఘనమైన నౌకరుగా కనిపించాడు.

"వద్దునుగాని పనులు పాడవుతాయండీ," అన్నాడు సారంగుడు.

''నీ దారి ఖర్చులు మేమే పెట్టుకుని, నీకింత ముట్ట జెప్పుతాంలే,'' అన్నారు వాళ్లు. సారంగుడు వాళ్ళవెంట బయలుదేరటానికి సమ్మతించాడు.

వాళ్ళు సారంగుణ్ణి వెంట తీసుకుని బయలుదేరి, మధ్యాన్నంవేళకు ఒక కొలను ఒడ్డున కూర్చుని భోజనాలకు ఉపక్రమించారు. ఆ సమయంలో సారంగుడికి కొలను వేపునుంచి మాటలు వినిపించాయి. అతను తల తిప్పి చూసేసరికి రెండు కప్పలు కనిపించాయి. ఒక కప్ప ఒక చిన్న గుళికను చేత్తో పట్టుకుని చూస్తున్నది.

''ఏమిటది?'' అన్నది రెండో కప్ప.

''ఇదొక గొప్ప ఔషధం,'' అన్నది మొదటి కప్ప.

''నేను నమ్మను,'' అన్నది రెండో కప్ప.

''నువు నమ్మకపోతే కొంప మునిగిపోలేదు. చావు బతుకుల్లో ఉన్న గ్రామాధికారి తల్లిచేత దీన్ని మింగిస్తే క్షణంలో లేచి కూచుంటుంది,'' అన్నది మొదటి కప్ప.

''నమ్మే మాటే!'' అంటూ రెండో కప్ప బుడుంగున నీటిలోకి దూకింది.

మొదటి కప్ప గుళికను వదిలేసి తాను కూడా నీటిలోకి దూకింది.

సారంగుడు లేచి వచ్చి ఆ గుళికను తీసి జేబులో వేసుకున్నాడు.

అతని వెంట ఉన్న పెద్ద మనుషులు భోజనాలయాక మెత్తని గడ్డి మీద కాసేపు కునుకు తీసి, పొద్దు వాలేవేళకు బయలుదేరారు. ఆ ముగ్గురూ గ్రామం చేరేసరికి చీకటి పడింది.





వాళ్ళు ఆ రాత్రికి సత్రంలో బస చేద్దా మనుకున్నారు. కాని సత్రం యజమాని వాళ్ళ మాట వినిపించుకునేటట్టు లేదు. "అవతల గ్రామాధికారి తల్లి ఏ క్షణాన పోతుందో అన్నట్టున్నది. నేను వెంటనే వెళ్ళి ఇంకా వైద్యులను వెతుక్కురావాలి," అన్నాడాయన.

"మీకు కావలిసిన వైద్యుణ్ణి నేనే, బాబుగారూ. ఇంకా వైద్యులెందుకు? నన్ను గ్రామాధికారి ఇంటికి తీసుకుపొండి," అన్నాడు సారంగుడు.

సత్రం యజమాని సారంగుడి కేసి వింతగా చూసి అతన్ని గ్రామాధికారి ఇంటికి తీసుకుపోయాడు. ముసలావిడ స్పృహలేని స్థితిలో ఉన్నది. సారంగుడు తనవద్ద ఉన్న గుళికను ఆమె నోటవేసి, ఇన్ని నీళ్లు పోయించాడు. కొద్ది క్షణాలలో ఆమె కళ్లు తెరిచింది. ఆమె పక్కనే కూర్చుని ఉన్న వైద్యుడు ఆమె నాడి పరీక్షించి, "మొత్తానికి తేరుకున్నది. ఇక భయం లేదు," అన్నాడు.

అందరూ సారంగుడికి బ్రహ్మరథం పట్టే శారు. గ్రామాధికారి అతనికీ, అతని వెంట ఉన్న ఇద్దరు పెద్దలకూ, చూడవచ్చిన జనానికీ రాత్రి విందు చేయించాడు. సారంగుడు రామపురం వెళుతున్నట్టు తెలుసుకుని, దారిలో అతను ఆగిన చోటనల్లా విడిదికీ, భోజనాలకూ ఏర్పాట్లు జరిపించమని చెప్పటానికి వెట్టివాళ్ళను ఆ రాత్రే పంపాడు.

మర్నాడు ఉదయం ముగ్గురూ బయలుదేరి ఆ రాత్రికి ఒక ఊళ్ళో సత్రం చేరుకున్నారు. ఆ సత్రం నిండా జనం ఉన్నారు. అయినా ఈ ముగ్గురి కోసమూ అన్నిఏర్పాట్లూ ముందే జరిగాయి. వాళ్లు భోజనాలు ముగించుకుని, తమ కోసం ప్రత్యేకించిన ఒక గదిలో పడుకున్నారు. అయితే వాళ్లకు నిద్రపట్టకుండా వెలపల చాలా కుక్కలు మొరగసాగాయి.



"ఛీ, ఛీ! ఈ వెధవకుక్కలు నిద్ర పోకుండా చేస్తున్నాయి," అన్నారు సారంగుడి వెంట ఉన్న పెద్దమనుషులు.

"అలా అనకండి. అవి చాలా పెద్ద ఉపకారం చేస్తున్నాయి. ఈ రాత్రి సత్రంలో దొంగలు పడతారట. ఒక దొంగ సత్రంలోనే ఉన్నాడట. వాడు అర్ధరాత్రి వేళ తలుపులు తెరిచి తన అనుచరులను లోపలికి రానిస్తాడట," అన్నాడు సారంగుడు.

"నిజమా?" అన్నారు పెద్దమనుషులు.

"జంతువులు అబద్ధాలాడవు," అన్నాడు సారంగుడు.

సత్రంలోని వాళ్ళకు హెచ్చరిక జరిగింది. అర్ధరాత్రి సత్రం యజమానే తలుపు తెరిచి దొంగలను లోపల ప్రవేశపెట్టాడు. అందరూ నిద్రపోతున్నట్టు నటిస్తూ దొంగలను పట్టేశారు. యజమాని కూడా పట్టుబడ్డాడు.

మర్నాడు సారంగుడూ, అతని వెంట వున్న పెద్ద మనుషులూ మళ్ళీ ప్రయాణం సాగించి, మధ్యాన్నం వేళకు ఒక వాగు చేరి, దాని సమీపంగా విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆ సమయంలో సారంగుడు పెద్దమనుషులతో, "మనని గురించి చేపలు కూడా మాట్లాడుకుంటున్నాయి," అని చెప్పాడు.

"ఏమని?" అని వాళ్ళు అడిగారు.

"మనలో ఎవరో ఒకరు మంత్రి కాబోతారుట," అన్నాడు సారంగుడు.

ఇద్దరు పెద్ద మనుషులూ పరమానందం చెందారు, ఇద్దరికీ మంత్రి అయే అవకాశం సమంగా ఉన్నట్టు. కాని ఆ సాయంకాలం వాళ్ళు రామపురం చేరేసరికి మంత్రి పదవి సారంగుడి కోసం వేచి ఉన్నది. అతను గ్రామాధికారి తల్లిని బతికించిన వార్తా, దొంగల ముఠాను పట్టిచ్చిన వార్తా రాజుగారికి ముందుగానే చేరాయి. అతన్ని మంత్రిగా నియమించాలని రాజుగారు వెంటనే నిర్ణయించాడు.





# మహాభారతం

సంతానాపేక్షతో ముని ఆశ్రమాల చుట్టూ తిరిగిన ద్రుపదుడు ఒక కొడుకునూ, ఒక కూతురినీ కోరాడు. కొడుకెందుకంటే, ద్రోణుణ్ణి చంపటానికి; కూతురు అర్జునుడికి భార్య కాగలందులకు. ఈ కోరికతో ఆయన వివిధ ఆశ్రమాలు తిరుగుతూ గంగా యమునా సంగమం వద్ద గల ఒక ఆశ్రమాన్ని చేరాడు. అక్కడ యాజుడూ, ఉపయాజుడూ అనే ఇద్దరు అన్నదమ్ములు, కాశ్యపగోత్రం వాళ్ళు, రోజల్లా వేదపారాయణం చేస్తూ, సూర్యారాధన జరుపుతూ ఉంటున్నారు. వారిలో తమ్ముడైన ఉపయాజుడే ఎక్కువ తపోబల సంపన్నుడుగా ద్రుపదుడికి కనిపించాడు. అందుచేత ద్రుపదుడు ఆయన దగ్గిర చేరి ఎంతో భక్తిశ్రద్ధలతో సేవలు చేయసాగాడు.

ఒకనాడు ద్రుపదుడు ఏకాంతంలో ఉపయాజుడికి కాళ్ళు పట్టుతూ, "మునీశ్వరా, ద్రోణుడు నాకు తీరని అవమానం చేశాడు. నేనుగాని, మరో రాజుగాని ఆయనను చంపే శక్తిగలవాళ్ళం కాము. ఆ ద్రోణాచార్యుణ్ణి చంపగల కుమారుడు నాకు కలిగేటట్టుగా తమరు అనుగ్రహించే పక్షంలో తమకు అసంఖ్యాకంగా గోవులనూ, తాము కోరే ఇతర వస్తువులనూ ఇవ్వగలను," అన్నాడు.

దానికి ఉపయాజుడు, "నా కిలాటి కోరికలేమీలేవు. అదీగాక నేను ఇటువంటి పనులకు సహాయంచెయ్యను," అని ఆ ప్రసంగం అంతటితో కట్టిపెట్టేశాడు.

13. ద్రుపదుడి సంతానం





తిన్నాడు. మేము గురుకులవాసం చేసే టప్పుడుకూడా శుచీ, అశుచీ అన్న విచక్షణ లేకుండా జిహ్వకు రుచి అయినదెల్లా తినే వాడు," అన్నాడు.

ఉపయాజుడీ మాట చెప్పగానే ద్రుప దుడు యాజుడి ఆశ్రమానికి వెళ్లి, అయనకు నమస్కారం చేసి, ఎనభైవేల గోవులను కానుకగా సమర్పించి, తన కోరిక తెలు పుకున్నాడు.

యాజుడిందుకు సమ్మతించాడు. అయన ఉపయాజుణ్ణి తనకు సహాయం ఉంచుకుని, అవసరమైన సంభారాలన్నీ సేకరించి, పుత్రకామేష్టి ప్రారంభించాడు. అయన హెూమం చేసి, అనంతరం హవిస్సు చేతిలోకి తీసుకుని, ద్రుపదుడి భార్య అయిన కోకిలాదేవిని పిలిచి, "ఈ హవిస్సు పుచ్చుకో. నీ గర్భాన ఒక కొడుకూ, కూతురూ జన్మి స్తారు," అన్నాడు.

అప్పుడు కోకిలాదేవి, "అయ్యా, అశుచిగా ఉన్నాను. కొంచెం అగండి, స్నానం చేసి వస్తాను," అన్నది.

"నేనూ, నా తమ్ముడూ కలిసి తయారు చేసిన హవిస్సు నీ కోరిక తీర్చక పోతుందా? వస్తేరా, లేకపోతే మానెయ్యి," అంటూ యాజుడు హవిస్సును అగ్నిలో వేశాడు.

అయినా ద్రుపదుడు నిరాశచెందక ఉప యాజుణ్ణి మరింత శ్రద్ధగా సేవించసాగాడు. ఒక ఏడాది గడిచింది. ఒకనాడు ఉపయా జుడు ద్రుపదుడితో, "రాజా, నాకు అంతు లేని సేవలు చేస్తున్నావు. కాని నీ కోరిక అనుచితమైనది, అందుచేత అది నెరవేర టానికి నేను సహాయపడను. అయినా ఒక ఉపాయం చెబుతాను. నువు నా అన్న అయిన యాజుణ్ణి ఆశ్రయించు. అతన్ని మెప్పించు. అంతులేని గోవులను ఇస్తానని ఆశపెట్టు, అతను నీ కోరిక తీర్చవచ్చు. అతను మొదటినుంచీ కొంచెం ఆశాపరుడు. ఒకసారి అశుభ్రమైనచోట రాలిన పండు







ఆ అగ్నికుండంలో నుంచి ఒక యోధుడు ఒక చేత కత్తీ, ఒక చేత విల్లూ ధరించి, నెత్తిన మణిమయమైన కిరీటంతో సహా, రథారూఢుడై వెలువడి, సింహనాదం చేస్తూ ఎటో వెళ్ళిపోయాడు.

తరవాత ఆ అగ్నికుండం నుంచే ఒక తేజస్విని అయిన స్త్రీ పుట్టింది. ఈ విధంగా ద్రుపదుడు ఒక కొడుకునూ, కూతురినీ పొందినవాడయాడు. పాంచాలు లందరూ పరమానంద భరితులయారు.

ఇంతలో కోకిలాదేవి స్నానం చేసి వచ్చి, అగ్నికుండంలో పుట్టిన బిడ్డలిద్దరికీ తాను తల్లి అయేటట్టుగా యాజుడి వద్దా, ఉపయాజుడి వద్దా వరం పొందింది.

బ్రాహ్మణులు ద్రుపదుడి కొడుకుకు ధృష్టద్యుమ్నుడు అనీ, కుమార్తె నల్లనిది కావటంచేత కృష్ణ అనీ పేర్లు పెట్టారు. ద్రుపదుడు యాజుడికి అంతులేని గోవులనూ, బ్రాహ్మణులకు అంతులేని ధనాన్నీ ఇచ్చి, కాంపిల్యనగరానికి తిరిగి వచ్చాడు.

కొంతకాలమయాక ద్రుపదుడు ధృష్టద్యుమ్నుణ్ణి ద్రోణుడి వద్ద అస్త్రవిద్యాభ్యాసం కోసం పంపాడు. విద్య నేర్పనంటే తనకు అపకీర్తి వస్తుందని ద్రోణుడు ఆ కుర్రవాడికి విలువిద్యలన్నీ నేర్పాడు.

ద్రుపదుడి కూతురు ద్రౌపది వివాహ యోగ్యురాలయింది. ఆమెను అర్జునుడి కిచ్చి చేద్దామని మొదటి నుంచీ ద్రుపదుడి ఉద్దేశం. అయితే పాండవులు లక్క ఇంట కాలిపోయారని వార్త తెలిసింది. ద్రుపదుడు హతాశుడై తన బంధుమిత్ర మంత్రి పురోహితులను సమావేశపరిచి కర్తవ్యం గురించి వారి సలహా అడిగాడు.

అప్పుడు ద్రుపదుడికి ఆప్తుడైన పురోహితు డొకడు, "మహారాజా, పాండవులకు అపాయం జరిగిందని తోచదు. అనేక శకునాలను బట్టి వారు సుఖంగానే ఉన్నట్టు కనబడుతుంది. నీ కెందుకు? నువు



స్వయంవరం ప్రకటించు, వారు తప్పక వస్తారు. రాజకన్యలకు స్వయంవరం పరిపాటే గదా!" అన్నాడు.

మూడున్నరమాసాల అవతల స్వయంవరానికి ముహూర్తం ఏర్పాటయింది. ఎక్కుపెట్టటానికి ఒకంతట సాధ్యంకాని విల్లు ఒకటి సిద్ధం చేయబడింది. ఒకచోట, ఆకాశాన తిరిగే బంగారు మత్స్యయంత్రం అమర్చబడింది.

ఏకచక్రపురంలో కుంతీ పాండవులుంటున్న బ్రాహ్మణుడి ఇంటికి అతిథిగా వచ్చిన బ్రాహ్మణుడీ వివరాలన్నీ చెప్పి, "ఎక్కడెక్కడి రాజులూ ద్రౌపదీ స్వయంవరానికై కాంపిల్యనగరానికి పోతున్నారు," అని ముగించాడు.

తమ గురువైన ద్రోణాచార్యుణ్ణి చంపే వాడొకడు పుట్టాడని విని పాండవులు విచారించారు, కాని కానున్నది అయేతీరుతుందనుకుని సమాధానపడ్డారు. వారికి కూడా ద్రౌపదీ స్వయంవరానికి వెళ్ళాలని ఉన్నది. ఈ సంగతి గ్రహించి కుంతీదేవి ధర్మరాజుతో, "నాయనా, మనం చాలా కాలంగా ఈ ఏకచక్రపురంలో ఉంటున్నాం. ఇంక కొన్నాళ్ళుపోతే మన కిక్కడ భిక్ష దొరకదేమో కూడానూ! మనం పాంచాల దేశం పోదామా ఏం? అది సుభిక్షమైన దేశమట. కాంపిల్యనగరం మహా అందంగా ఉంటుందట. రాజైన ద్రుపదుడికి బ్రాహ్మణులంటే ఎంతో అభిమానం అని అందరూ అంటున్నారు," అన్నది.

ధర్మరాజు తన తమ్ములతో కూడా సంప్రతించి తల్లి ఆలోచనకు అందరినీ ఒప్పించాడు. వాళ్ళు ఇల్లు గల బ్రాహ్మణుడితో తాము వెళ్ళిపోతున్నట్టు చెప్పి, ఏకచక్రపురం నుంచి బయలుదేరారు.

వాళ్ళు రాత్రీ పగలూ కూడా ప్రయాణం చేస్తూ ఒకనాడు అర్ధరాత్రివేళకు గంగానదీ తీరాన ఉన్న సోమశ్రవం అనే తీర్థాన్ని

చేరుకున్నారు. చీకటిగా ఉన్నది. అందరి కన్న ముందు అర్జునుడు ఒక కొరవి పట్టుకుని నడుస్తున్నాడు. గంగలో స్నానం చేయ సంకల్పించి వాళ్ళు నదిని చేర వస్తుండగా, ఆ సమయంలో గంగలో తన భార్యలతో జలక్రీడలాడుతున్న అంగారపర్ణు డనే గంధర్వుడు మనుషుల అలికిడి విని, "ఎవరా వచ్చేది? దూరంగా పొండి. ఈ చుట్టుపక్కల ఉన్న వనమంతా నాది. నేను అంగారపర్ణు డనే గంధర్వుణ్ణి. ఇది యక్ష రాక్షస గంధర్వులు సంచరించేవేళ. మనుషులు సంచరించరాదు," అన్నాడు.




ఆ మాట విని అర్జునుడు, "దుర్మార్గుడా, హిమాలయప్రాంతమూ, గంగానదీ ఒకరి సొత్తు ఎలా అవుతాయి? అవి అందరివీనూ. గంగను చూసినప్పుడు, అర్ధరాత్రి అయేది, భోజనానంతరమయేది, విధిగా స్నానం చెయ్యాలి. అందుచేత మేము నదిలో స్నానం చెయ్యకుండా ముందుకు పోము," అన్నాడు.

అంగారపర్ణుడికి కోపం వచ్చి బాణాలు వెయ్యసాగాడు. అర్జునుడు తన చేతిలో ఉన్న కొరవితో ఆ బాణాలను అడ్డుతూ, "ఒరే గంధర్వుడా, మమ్మల్ని నీ ముష్టి బాణాలతో బెదిరించటానికి మే మెవరమనుకుంటున్నావు? నీ మాయలేవీ మా ముందు సాగవు," అంటూ ఆగ్నేయాస్త్రం మంత్రించి ప్రయోగించాడు. దానితో గంధర్వుడి రథం మండి బూడిద అయిపోయింది. గంధర్వుడు కింద పడి మూర్ఛపోయాడు.

ఈ సమయంలో గంధర్వుడి భార్య కుంభీనసి ధర్మరాజును ఆశ్రయించి, తనకు పతిభిక్ష పెట్టమని వేడుకున్నది. ధర్మరాజు అర్జునుడితో, "ఈమె మనని శరణుజొచ్చి పతిభిక్ష కోరుతున్నది. అందుచేత నువు గంధర్వుణ్ణి చంపకు," అన్నాడు.

అన్న మాట విని అర్జునుడు గంధర్వుణ్ణి ప్రాణాలతో వదిలేశాడు.



గంధర్వుడు అర్జునుడితో, "నీతో ఓడి పోయాను గనక నేను అంగారపర్ణు డనే పేరు వదిలేస్తాను. నువు తగలబెట్టిన రథానికి బదులు మరొక చిత్రరథం సృష్టించుకుని, చిత్రరథు డనే పేరు పెట్టుకుంటాను. మహావీరుడివైన నీకు చాక్షుషి అనే విద్యను ఇస్తాను. దాని సహాయంతో నీకు మూడు లోకాలలో ఎక్కడ ఏది జరిగేదీ కనిపిస్తుంది. ఈ విద్య మా వద్ద ఉండటం చేతనే దేవతలు సైతం మమ్మల్ని ఏమీ చేయలేకుండా ఉన్నారు. చాక్షుషితో బాటు నీకు కొన్ని దివ్యాశ్వాలను కూడా ఇస్తాను. మీ అన్నదమ్ములు ఒక్కొక్కరికీ ఒక్కొక్క వంద అశ్వాలనిస్తాను," అన్నాడు.

దానికి అర్జునుడు, "ఎంత సన్నిహితుడి వద్ద నుంచి అయినా నేను ఏమీ తీసుకోను," అన్నాడు.

"అలా అయితే నాకు ఏదన్నా ఇచ్చి, దానికి బదులుగా నా నుంచి బహుమానం పుచ్చుకో," అన్నాడు గంధర్వుడు.

గంధర్వుడికి ఆగ్నేయాస్త్రం ఇచ్చి, అతని నుంచి అశ్వాలను పుచ్చుకోవటానికి అర్జునుడు సమ్మతించాడు.

గంధర్వుడు అతనితో, "మీరు క్షత్రియులు. అందుచేత మీరు తగిన పురోహితుణ్ణి ఏర్పాటు చేసుకుని, అతని సలహా ప్రకారం నడుచుకుంటే తప్ప మీకు శుభాలు చేకూరవు," అన్నాడు.

అర్జునుడు అతనికి ఆగ్నేయాస్త్రాన్ని సమంత్రకంగా ఉపదేశించి, "ప్రస్తుతం నీ గుర్రాలు నీ వద్దనే ఉండనీ. అవసరం వచ్చినప్పుడు తెప్పించుకుంటాను," అని చెప్పి, అతని వద్ద సెలవు తీసుకున్నాడు. పాండవులూ, కుంతీ తమ ప్రయాణం కొనసాగించారు.

పాండవులు గంగాతీరం నుంచి బయలుదేరి ఉత్కోచతీర్థానికి చేరుకున్నారు. అక్కడే ధౌమ్యుడు తపస్సు చేసుకుంటు

న్నాడు. పాండవులు ఆయనకు నమస్కారం చేసి తమకు పురోహితుడుగా ఉండమని ప్రార్థించారు. ధౌమ్యుడు పాండవుల ప్రజ్ఞా, పరాక్రమమూ, బలమూ, ఉత్సాహమూ గురించి సరిగా గ్రహించి, తన పౌరోహిత్యానికి వారు అర్హులని భావించి, వారికి అతిథి మర్యాదలు చేసి, వారి కోరిక తీర్చటానికి తన సమ్మతి తెలిపాడు. ఆయన తమకు పురోహితుడుగా ఉండటానికి ఒప్పుకోగానే పాండవులు భూమండలాని కంతకూ తామే రాజులయినంతగా ఆనందోత్సాహంతో పొంగిపోయారు.

అదే సమయంలో కొందరు ద్రౌపదీ స్వయంవరం చూడటానికి కాంపిల్యనగరానికిపోతూ ధౌమ్యు డుండే ఆశ్రమానికి వచ్చారు. వారిని చూసి పాండవులు, తాము కూడా తల్లినీ, ధౌమ్యుణ్ణీ వెంట పెట్టుకుని ద్రౌపదీ స్వయంవరోత్సవాన్ని చూసి ఆనందించాలన్న కోరిక వెలిబుచ్చారు.

బ్రాహ్మణ వేషాలు ధరించి ఉన్న పాండవులను చూసి ఆ బ్రాహ్మణులు, "మీరు ఎక్కడి నుంచి వచ్చారు? ఎక్కడికి పోతున్నారు?" అని అడిగారు.

"మేము ఏక చక్రపురం నుంచి కాంపిల్య నగరానికి ప్రయాణమై వెళుతున్నాం," అన్నాడు ధర్మరాజు.

"మేమూ అక్కడికే పోతున్నాం. అక్కడ ద్రుపదుడి కుమార్తెకు స్వయంవరం జరుగుతున్నది. ఆమె చాలా చక్కని దట. స్వయంవరానికి ఎందరో రాజులు వస్తున్నారట. అది చూడ వచ్చే బ్రాహ్మణులకు ఆ మహారాజు గోదానమూ, సువర్ణ దానమూ, అన్నదానమూ చేస్తున్నాడు. పెళ్ళి వేడుక చూసి మళ్ళీ తిరిగి వస్తాం," అన్నారు బ్రాహ్మణులు.

పాండవులూ, కుంతీ కూడా వారి వెంట దక్షిణ పాంచాలంలోని కాంపిల్యనగరానికి బయలుదేరారు.





# గాంధీ కథ

## 13

**1934** లో శాసనోల్లంఘనోద్యమం నిలిచి పోయింది. ప్రభుత్వం కాంగ్రెసుపైన ఉండిన ఆంక్షలను ఎత్తివేసింది. అటు తరవాత గాంధీ రాజకీయాల ప్రసక్తి మానుకుని గ్రామోద్ధరణ కార్యక్రమంలో మునిగి పోయాడు.

1937 లో నూతన రాజ్యాంగం అమలు లోకి వచ్చింది. దీని కింద భారతదేశం క్రమంగా స్వపరిపాలన సాధిస్తుందని రాజ్యాంగ నిర్మాత లన్నారు.

కాని 1937 లో ఆరు రాష్ట్రాలు కాంగ్రెసు మంత్రుల పరిపాలన కిందికి రావటం దేశ చరిత్రలో ప్రముఖమైన సంగతే. కాంగ్రెసు మంత్రివర్గాలు నిర్ణయించిన మద్య నిషేధమూ, విద్యాప్రణాళికా గాంధీకి చాలా తృప్తి కలిగించాయి. విద్యావేత్తలు కొందరు "వర్ధా విద్యావిధానం" రూపొందించారు.

కాంగ్రెసు పదవులు నిర్వహించటంతో ముస్లింలీగ్‌కూ కాంగ్రెసుకూ మధ్య విభేదాలు మరింత తీవ్రమయాయి. ప్రభుత్వంతో కూడా అడుగడుగునా ఘర్షణలు పెరుగుతూ వచ్చాయి.

1939లో ప్రపంచయుద్ధం వచ్చిపడింది. దానితో కాంగ్రెసుకూ, బ్రిటిషు పరిపాలనకూ మధ్య అగాధం ఏర్పడింది.

యుద్ధం వచ్చిన 10 రోజులకు కాంగ్రెసు నాజీల వాత పడినవారి పట్ల సానుభూతి ప్రకటిస్తూ తీర్మానం చేసింది; అయితే అదే తీర్మానంలో, ప్రజాతంత్రం పట్ల బ్రిటిషు వారి నికరమైన అభిప్రాయం తెలిపితే గాని భారతీయుల సహకారం లభించదని స్పష్టం చేసింది. అంటే, బ్రిటిషువారికి యుద్ధ సహాయం కావాలంటే, భారతీయులకు స్వాతంత్ర్యం ఇవ్వాలని అర్థం.





1941 లో జపాను యుద్ధంలో ప్రవేశించటంతో యుద్ధం భారతదేశపు సరిహద్దు మీదికి వచ్చింది కాంగ్రెసు ఖైదీలు విడుదల అయారు.

బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ఇండియాతో రాయబారం నడపటానికి కారణం యుద్ధంలో జపాను చూపిన విజృంభణ. జపానుకు సింగపూరు లొంగిపోయిన 10 రోజులకు భారతదేశ సమస్య పరిశీలించి, పరిష్కార మార్గం సూచించటానికి "కాబినెట్ మిషన్" ఒకటి ఏర్పాటయింది. స్టాఫర్డ్ క్రిప్స్ ఇండియాతో సంప్రతింపులకు వచ్చాడు. ఆయన తెచ్చిన సూచనలు పాకిస్తాన్ విభజనకు మరింత అనుకూలంగానే ఉన్నాయి.

1942 జులై 14 న కాంగ్రెసు వర్కింగు కమిటీ వర్ధాలో సమావేశమై, బ్రిటిషువారు తక్షణమే ఇండియాను వదిలి వెళ్ళిపోవాలని తీర్మానించింది. ఆలిండియా కాంగ్రెసు కమిటీ సమావేశం బొంబాయిలో ఆగస్టు 7 న జరిగి, "క్విట్ ఇండియా" తీర్మానం చేయబడింది. ఆగస్టు 9 వ తేదీ తెల్లవారు ఝామున గాంధీ, నెహ్రూ, అజాద్ మొదలైన కాంగ్రెసు అగ్ర నాయకులు ఒక్కసారిగా అరెస్టు అయారు. ఈ వార్తతో దేశమంతా అట్టుడికి పోయింది. జనం రెచ్చిపోయారు.

బ్రిటిషువారు భారతీయులకు స్వాతంత్ర్యం ఇచ్చే ధోరణిలో లేని కారణంచేత కాంగ్రెసు నాయకులు ఉద్యమం ప్రారంభించటానికి తహతహలాడారు. కాని గాంధీ వ్యష్టి సత్యాగ్రహానికే అనుమతించాడు. 1940 అక్టోబరు 17 న వ్యష్టి సత్యాగ్రహం ఆరంభమయింది. రెండున్నర నెలల లోపల 400 మంది కాంగ్రెసు శాసన సభ్యులూ, 29 మంది మాజీ మంత్రులూ జైళ్ళకు వెళ్లారు. 1941 మే 15 నాటికి 25,069 మంది జైళ్ళలో ఉన్నారు. అయితే ఉద్యమం చాలా నిశ్శబ్దంగా సాగింది. యుద్ధప్రయత్నాలకు ఎలాటి విఘ్నమూ కలగలేదు.

దేశమంతటా రౌద్రచర్యలు జరిగాయి. ఈ ఉద్యమాన్ని ప్రభుత్వం మహా క్రూరంగా అణచివేసింది.

ఈ సారి జైలులో గాంధీ ఇద్దరు సన్నిహితులను కోల్పోయాడు. ఒకడు ఆయన కార్యదర్శి మహదేవ దేసాయ్. రెండవది కస్తూర్‌బాయి. 1944 ఫిబ్రవరి 22 న ఆమె తన భర్త ఒడిలో ప్రాణాలు వదిలింది. ఆమె గాంధీతో 62 ఏళ్ళపాటు కాపరం చేసి, ఆయన జీవితాన్ని పూర్తిగా పంచుకున్నది. ఆ ఏడు, మే 6 న, ప్రభుత్వం గాంధీని విడుదల చేసింది.



యుద్ధం ముగిసినాక బ్రిటిషువారు భారత దేశ సమస్యను పరిష్కరించే ధోరణిలో ఉన్నట్టు స్పష్టమయింది. అయితే ఇది చాలా క్లిష్టసమస్య అయి కూర్చున్నది. బ్రిటిషువారు జిన్నాను అసంతృప్తి పరచటానికి సిద్ధంగా లేరు. వావెల్ నెహ్రూను ఏర్పరచమన్న ప్రభుత్వంలో జిన్నా చేర నిరాకరించాడు. 1946 ఆగస్టు 16 న ముస్లిమ్‌లీగ్ ప్రత్యక్ష చర్యాదినం జరిపింది.

ఆ రోజు కలకత్తాలో ప్రారంభమైన హత్యాకాండ నాలుగు రోజులు సాగింది. మృత్యుదేవత కలకత్తాలో వీర విహారం చేసింది. అయిదువేలకు పైగా చచ్చారు. 15 వేల మంది గాయపడ్డారు. బెంగాలును పరిపాలించే ముస్లిమ్‌లీగ్ ప్రభుత్వం చూస్తూ ఊరుకున్నది. ముందు దెబ్బ తీసినది ముస్లిములే. కాని అనంతరం హిందువులు ప్రతి చర్య జరిపారు. రెండు నెలల అనంతరం (తూర్పు బెంగాలు) నవఖాలీ జిల్లాలో ముస్లిములు హిందువులను బలి పుచ్చుకున్నారు. తాను వెళ్ళి ఏమి చేసేదీ తనకే తెలియకుండా గాంధీ నవఖాలీకి వెళ్ళాడు. గాంధీ రాకవల్ల తూర్పు బెంగాలులో అశాంతి చాలా తగ్గింది.

నవఖాలీకి బిహారు "జవాబు" చెప్పింది. అసంఖ్యాకులైన ముస్లిములను హిందువులు

చంపారు. 1947 మార్చి 2 న గాంధీ బిహారు వెళ్ళాడు. అధిక సంఖ్యాకులు అల్ప సంఖ్యాకులకు అండగా ఉండాలని ఆయన నవఖాలీ ముస్లిములకూ, బిహారు హిందువులకూ కూడా బోధించాడు. 1946-47 లలో జరిగిన హింసా కాండలు గాంధీకి ఏ మాత్రమూ అంతుబట్టలేదు. భారతదేశం ద్వారా ప్రపంచం అహింస నేర్చుకోవాలని ఆయన ఎంతగానో ఆశించాడు. కాని స్వాతంత్ర్యంతో అంతర్యుద్ధం ముడిపడి ఉన్నది.

ఈ అంతర్యుద్ధాన్ని నివారించటానికి గాను మౌంట్‌బాటన్‌కు గాంధీ ఇచ్చిన సలహా ఏమిటంటే, కాంగ్రెసు, లీగు సమిష్టి ప్రభుత్వాలు రద్దు చేసి, జిన్నా చేత జాతీయ ప్రభుత్వం ఏర్పాటు చేయించమని. కాని జిన్నా దేశ విభజన జరిగి తీరాలన్నాడు 1947 ఆగస్టు 15 న ఇండియా పాకిస్తానులు వేరు వేరుగా స్వతంత్రదేశాలై అవతరించటానికి జూనులోనే నిర్ణయం జరిగింది. దేశ విభజనకు నెహ్రూ, పటేలు మొదలైన వర్కింగు కమిటీ సభ్యులంతా అంగీకరించారు. గాంధీ అనుమతి ఎవరూ అడగలేదు.

దేశ విభజన రోజులలో తన సిద్ధాంతాలు మంట కలవటం గాంధీ కళ్ళారా చూశాడు. ఆగస్టు 31 న ఆయన బేలీఘటా (బెంగాలు)లో ఉండగా హిందువులు ఆయన ఇంటిపై దాడి చేసి ఆయన మీద రాళ్ళు వేశారు. ఆయనను రాళ్ళతో కొట్టాలని యత్నించారు. ఆయనకు దెబ్బలు తగలలేదు గాని, శాంతి నెలకొల్పటానికి ఆయన చేసిన కృషికి ఫలితం అలా ఎదురయింది. చివరకు ఆయన హిందువుడి చేతిలోనే బలవన్మరణం పొందాడు. మత సామరస్యం కోసం గాంధీ తన జీవితమంతా చేసిన కృషికి ఆయన పొందిన కానుక ఒక హిందువుడు పేల్చిన పిస్తోలు గుళ్లు!

—(అయిపోయింది)



# 100. యంత్ర మానవుడు

ఈ యంత్రాన్ని మాస్కో శివార్లలో గల షెల్కోవపట్టణం లోని యువ సాంకేతికజ్ఞులు తయారు చేశారు. దీని నిర్మాణాన్ని పర్యవేక్షణ చేసిన ప్రవీణుడు వి. వి. మత్స్క్యేవిచ్. ఇది ఎలక్ట్రానిక్ పరికరాలతో తయారైనది. ఇది తన జన్మవృత్తాంతాన్ని చెబుతుంది. అనంతరం ప్రశ్నలకు సమాధానాలు చెబుతుంది. అది "మాట్లాడే" టప్పుడు దాని నోటిలోని కాంతి మార్పులు చెంది, పెదవులు కదులుతున్నట్టు మనకు భ్రమ కలుగుతుంది. ఇది నడుస్తుంది; చేతులు ఆడిస్తుంది; సంగీతానికి నృత్యం చేస్తూ, ఒయ్యారంగా తల ఆడిస్తుంది. ఇది లెక్కలు కూడా చేయగలదు. ప్రస్తుతం ఇది కూడికలూ, తీసివేతలూ మాత్రమే చేస్తున్నది.



Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

పడతావు

పంపినవారు :
డి. సుశీల, హైదరాబాద్

Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

పట్టు పడతావు

పంపినవారు:
డి. సుశీల, హైదరాబాద్

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 మే నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యయి ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పడతావు

రెండవ ఫోటో : పట్టుపడతావు

పంపినవారు : డి. సుశీల,

కుర్మగుడ, హైదరాబాద్ - 36

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

పనిలో విశ్రాంతిలో
ఆనందం పొర్లనీయండి
గొప్ప రుచికి A-1 డస్ట్
సువాసన పూరితం—
డబ్బు ఆదాచేస్తుంది








# బ్రూక్ బాండ్ A-1 డస్ట్ ప్యాకెట్టుకు హెచ్చు కప్పుల మంచి టీ

BB 5380

# భరింపరాని ఒళ్లునొప్పి నిమిషాలలో పోయింది!



# అమృతాంజనం

## ప్రభావంవల్లనే!

ఒళ్లునొప్పులు, జలుబులు, తలనొప్పి, బెణుకులు— వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్న చోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాలపైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గిర ఉంచుకోండి. అమృతాంజనం ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, చిన్న డబ్బాలలోనూకూడా దొరుకుతోంది.




అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది.
నొప్పులను జలుబులను చప్పున, చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్
మదరాసు - బొంబాయి - కలకత్తా - న్యూ ఢిల్లీ - హైదరాబాదు - బెంగళూరు.

AM-5433

